**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

భాస్కర శతకము : టీకాతాత్పర్యసహితము. - Ellore: Venkat Ram & Co., 1928.

iv, 103 p. ;19 cm.

Record no. 33

Bhāskara śatakamu : ṭīkātātparyasahitamu. - Ellore: Venkat Ram & Co., 1928.

iv, 103 p. ;19 cm.

Record no. 33

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began:

# BHASKARA SATAKAM

***With Full Annotations.***



**Venkata Ram & Co.,**

*Publishers & Book-sellers,*

*Head Office:-ELLORE.*

---

RAMA PRESS: POWERPET. ELLORE.

May 1928. Rs. 10/-

# పీఠిక.

---

ఈ భాస్కరశతకమును రచించిన కవినిగూర్చి పలువురు పలువిధములగు గాథలను జెప్పుచున్నారు. ఈ శతకము నిరువురు కవులు రచియించిరని కొందఱును, ఒక్కఁడే రచించెనని మరికొందఱును జెప్పుచున్నను బ్రి॥ కేతవరపు వేంకట శాస్త్రిగారు చెప్పినట్లు శైలినిబట్టియు, చెన్నపురిలోని దొరతనమువారి ప్రాచ్యలిఖితపుస్తకాలయములోని గ్రంథమునుబట్టియు నీ భాస్కరశతకమును మారన వెంకయ్యయను కవియొకఁడే రచించెననుట సమంజసము. కవి యెవ్వఁడైననేమి! ఎందఱైననేమి! దీనియందలి నీతుల కానందింపవలయును. ఈతఁడు సూర్యోపాసకుఁ డగుటచే భాస్కరా యను మకుటముతో జక్కఁగ నిర్వహించియుండెను. ఈతఁడు ఈ శతకమును రచింపఁబూని తనకు సూర్యుని యందుఁ గల భక్తి లోకమున వెల్లడించుటకై యొక యగాధమగు నూతిపై మధ్యగ నొక దూలమును వైచి దాని కొక నూట యెనిమిది చేరులు గల యుట్టి నొక దానిని గట్టి దానిలో నొక తట్టను బెట్టి తానందుఁ గూర్చుండెననియు నొక్కొక్క పద్యమును జెప్పుచు నొక్కొక్క యుట్టిచేరునుగోయుచునిట్లు యష్టోత్తరశత పద్యములు పూర్తియగునప్పటికి, అన్ని చేరులును దెగిపోయెననియుఁ దట్టలో నాకవి నూతంగూలక నిలిచియుండెననియు

లోకమున మయూరకవి సూర్యశతకమునాటి గాథనుగల్పించి పుక్కిటిగాథను వ్యాపింపఁజేసిరి. పద్యములను బట్టిచూడ నీతియె ప్రధానముగ నుండును గాని భక్తి ప్రధానముగ నీశతకముగాన్పించదు. ఇంతియగాక గ్రంథాంతరములవలన నీశతకమునఁ బద్యము లుష్ట్రోత్తరశతకమునుమించి కానవచ్చుచున్నవి. ఇందు భాస్కరాయను సూర్యసంబోధనమునకు 1, 40, 87 పద్యములయందు మాత్రమే "మునిసన్నుతమద్గురుమూర్తి" అనియు, "యోగీంద్ర నుతాంఘ్రిపద్మ" అనియు "శుభకారణసన్మునిసేవ్య" అనియు విశేషముల వాడియున్నాఁడు. దీనినిబట్టి భక్తివిశేషమును లోకమునకుఁ జూపదలంచినవాఁడు కాడనియు, నీతిని దెలుపుటయే ముఖ్యమని యెంచి పద్యములువ్రాసెను గాని తనపేరును, ఆద్యంతములయం దెచ్చటను దెలియఁబరపకుండుటచే లౌకికకీర్తినికోరినవాఁడు కాడనియు స్పష్టమగుచున్నది. పయి మూఁడు తావుల భాస్కరు విశేషణములను బద్యపూరణమునకై పెట్టినవేయని తోఁపఁజేయుచున్నది.

ఈ గ్రంథమునఁ బూర్వోత్తరార్థములతోఁ గూడిన యుపమానోపమేయసంధాన పద్యములన్నింటిలోఁ బదునేడు పద్యములకు మాత్రమే "ఎట్లనగా" అనుసంధానవాక్యమును వాడియున్నాఁడు. తక్కిన యన్నిపద్యములయందును సంధాన వాక్యమును తెచ్చి పెట్టుకొనునదిగా నిలిపియుండెను. సాధార



ణముగా నీతని కవిత్వమునందే తెచ్చి పెట్టుకొను నాచారమెక్కుడుగ నెల్లతావులఁ గాన్పించును. ఈ యాచారము సంస్కృతమునం దధికముగఁ గాన్పించుచుండునే కాని యాంధ్రమునందంత విరళముగ నుండదు. ఆదారి యిక్కవి కెక్కుడభ్యాసమయినట్లు తోఁచుచున్నది.

మఱియొక గాథలో నన్నయమ్మలిరువురును భాస్కరుఁడను రాజున కంకితమిచ్చి పెద్దవాఁడు పూర్వార్థమును, చిన్నవాఁ డుత్తరార్థమును జెప్పి శతకమును సంపూర్తిచేసిరనుట గూడ బాగుగ లేదు. ఏమనఁగా నీశతకమునఁ బూర్వార్థోత్తరార్థ విభజనకుఁగూడ వీలులేని కొన్ని నీతిపద్యములు కలవు. అంతియేగాక భాస్కరుఁడను నృపాలునిచెంతఁ దమ పాండిత్యప్రకర్షనంతగా వెల్లడించి యాతని మెప్పించి బహుమానములఁ గాంచినవారు, ఎచ్చటనైన దమ విషయమును గాని రాజు విషయమునుగాని నీతిమూలముననే యుద్ఘాటింపకుందురో; ఒకరాజమాత్రునకే కృతినిచ్చినయెడల "మునిసన్నుతమద్గురుమూర్తి" అనియు, "యోగీంద్రనుతాంఘ్రిపద్మ" అనియు "శుభకారణసన్మునిసేవ్య" అనియు నీమహత్తరవిశేషణములను బెట్టియుందురా? కవు లిరువురే యైనయెడల నిందలి చివరపద్యమున "ఇంచుక నేర్పుచాలక, విహీనతఁ జెందిన నా. కవిత్వమున్" అని యేకవచనప్రయోగమేల చేసికొందురు?

వీని నన్నిటింబట్టిజూడ నీశతకమును ఒక్కకవియే రచించెననుటకు సంశయ మెంతమాత్రముండదనియు, నీ గాథ లన్నియుఁ బుక్కిటి పురాణములనియుఁ బాలునకు సయితము తెలియక పోదు.

ఈకవి యుపమానరూపమున సకలపురాణేతిహాసము లనువెల్లడించి పాఠకులకు మహోపకారమొనరించెను. ఇందు వ్యాకరణదోషములని పరిగణింపఁబడు తావులు కొన్ని కాన్పించుచున్నను నవి లేఖకాది ప్రమాదములనియే నాతలంపు.

ఏదియెట్లున్నను నీయది నీతిప్రదమగు గ్రంథమనియెంచి యెల్లరును బఠింతురు గాకయని కోరుచుంటిని.

ఇట్లు సజ్జనవిధేయుఁడు,

క్రొత్తపల్లి సుందరరామయ్య.





శ్రీరామాయనమః.

శ్రీశారదాంబాయైనమః.

# భాస్కరశతకము.

టీకాతాత్పర్యసహితము.




గలభాగ్యశాలిఁ గడుఁ
జేరగవత్తురు తారుదారె దూ
రాగమన ప్రయాసమున
కాదట నోర్చియునైన నిల్వను
ద్యోగముచేసి రత్ననిల
యుండనికాదె సమస్తవాహినుల్
సాగరు జేరుటెల్ల ముని
సన్నుత మద్గురు మూర్తిభాస్కరా. 1

టీ, మునిసన్నుత = మౌనులచేఁ బొగడబడుచున్నట్టియు, మత్ = నాకు, గురుమూర్తి = గురురూపుఁడవైనట్టియు, భాస్కరా. ఓసూర్య భగవానుఁడా! దూర + ఆగమనప్రయాసమునకున్ = దవ్వునుండి యేతెంచుటవలనఁ బుట్టినశ్రమకు, ఓర్చియున్ = సహించియు, నిల్వన్ = నిలుచుటకు ఉద్యోగముచేసి = యత్నముచేసి,!(పనిఁబూని)తారు + తారు ఎ + = తమంతఁదామే, ఆదటన్ = అనురాగముతో (మక్కువతో) శ్రీగల భాగ్య

శాలిన్ = సంపత్తుఁ (భాగ్యము) గలయైశ్వర్యవంతుని, కడున్ = మిగుల (ఎక్కువగా) చేరఁగవత్తురు = దగ్గఱిల్లుదురు, (మనుష్యులు అనుకర్త్రుపదమును దెచ్చుకొనవలెను) ఎట్టులన, సమస్తవాహినుల్ = సకలమైననదులును, సాగరున్ = రత్నాకరుని (అనఁగాఁ గడలిననుట) చేరుట, ఎల్లన్ = సమీపించుటంతయు, (ఆలోచింపగా) రత్న = మణులకు, నిలయుండని కాదె = ఉనికిపట్టుగాఁ గలవాఁడనియేకదా!

తా. ఎక్కడెక్కడఁబుట్టిన నదులును రత్నాకరుఁడను నాశతో సముద్రుని చేరువిధముగా నెన్నియిక్కట్టులకైన నోర్చి ప్రజలు దమంతటఁదామె ప్రియముం జూపుచు ధనికునియింటి కేతెంచుచుందురు.

ఉ. అంగన నమ్మరాదు ♦ తనయంకెకు రాని మహాబలాఢ్యు వే
భంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు వివేకి యైన సా
రంగధరుం బదంబులు క ♦ రంబులుఁ గోయఁగఁ జేసెఁ దొల్లి
చి, త్రాంగి యనేకముల్ నడువ ♦ రాని కుయుక్తులు పన్ని
భాస్కరా. 2

టీ. భాస్కరా! తనయంకెకున్ = తనస్వాధీనమునకు, రాని = రాకుండిన, మహాబల + ఆఢ్యున్ = ఎక్కువ బలముగలవానినైనను, వేభంగులన్ = వేయివిధములుగా (అనగా ననేకరీతులననుట) మాయలు = కుట్రలు, పన్ని = కూర్చి, చెఱుపన్ = పాడుచేయుటకు, తలపెట్టున్ = తలఁచును (కాఁబట్టి) అంగనన్ = స్త్రీని, నమ్మరాదు, తొల్లి = పూర్వకాలమందు, ♦ చిత్రాంగి = చిత్రాంగియనెడి స్త్రీ, వివేకి + ఐన = జ్ఞానవంతుఁడైన, సారంగధరున్ =

♦ చిత్రాంగి = రాజరాజనరేంద్రుని భోగస్త్రీ, అతిదుర్మార్గురాలు, గనుక లోకులు సాధారణముగా దుష్టస్త్రీని చిత్రాంగిఅని నిందింతురు. సారంగధరుఁడు రాజరాజనరేంద్రుని కొడుకు, అస్ఖలిత బ్రహ్మచారి. దైవభక్తిసంపన్నుఁడు. గొప్పపండితుఁడనికూడ వాడుకగలదు. ఈతని తల్లి రత్నాంగి.



తనసవతి కుమారుఁడగు సారంగధరునిగూర్చి, నడుపన్ = వచించుటకు, రాని కుయుక్తులు = వీలులేని చెడ్డపన్నాగములను, పన్ని, కల్పనఁజేసి, పదమ్ములు = కాళ్లు, కరంబులు = హస్తములు (చేతులు) కోయఁగన్ + చేసెన్ = ఖండించునట్లు చేసినది. (అనఁగా నరికించినదనుట)

తా. జ్ఞానవంతుఁడయిన సారంగధరునిమీఁద చిత్రాంగి చెడుకార్యము కల్పించి యాతని కరచరణములు తెగనరికించినవిధముగా, స్త్రీలు తమకు వశముగాని బల్లిదునిఁగూడ ననేకములగు మాయలుకల్పించి ప్రాణములు దీయనెంతురు గావున స్త్రీలను నమ్మరాదు.

ఉ. అక్కఱపాటువచ్చు సమ ♦ యంబునఁ జుట్టములొక్కరొక్కరి
న్మక్కువనుద్ధరించుటలు ♦ మైత్రికిఁ జూడఁగ యుక్తమే సుమీ
యొక్కట నీటిలో మెరక ♦ నోడలబండ్లును బండ్లనోడలున్
దక్కకవచ్చుచుండుట ని ♦ దానముగాదె తలంప భాస్కరా. 3

టీ. భాస్కరా! అక్కఱపాటు = తగినట్టి యవసరము, వచ్చు = వచ్చునట్టి, సమయంబునన్ = వేళయందు, చుట్టములు = బంధుగులు, ఒక్కరు + ఒక్కరిన్ = ఒకరినొకరు, మక్కువన్ = అనురాగముచే (కూర్మిచే) ఉద్ధరించుటలు = కష్టములనుండి లేవనెత్తుకొనుటలు, చూడఁగన్ = విచారింపఁగా (ఆలోచింపఁగా) మైత్రికిన్ = స్నేహమునకు; యుక్తము + ఏసుమీ = తగినదే సుమా! [ఎట్టులనఁగా] ఒక్కటన్ = ఒకవేళయందు, నీటిలోన్ = ఉదకమునందు, (అనఁగాఁ జలముమీఁదననుట) ఓడలన్ = పడవలమీఁద, బండ్లును = శకటములును, మెరకన్ = మెట్టయందు, బండ్లన్ = శకటములయందు, ఓడలున్ = నావలును, తక్కక = ఆగక, వచ్చుచుండుట = ఏతెంచుచుండుట, తలంపన్ = ఆలోచింపఁగా, నిదానము = నిదర్శనము, కాదె = కాదా! (అగును)

తా. ఒకానొక సమయంబున నీటిలో బడవలపై బండ్లును మెరకస్థలములయందు బండ్లపై నావలునువచ్చుచుండుట తార్కాణము (నిదర్శనము) అటులే ప్రపంచమునఁ జుట్టములుపనిబడ్డయపుడొకరినొకరు కాపాడుకొందురు

చ. అడిగినయట్టి యాచకుల ♦ యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొ ♦ కానొక యప్పుడు నీదు వాని
కయ్యెడలన దెట్లు; పాలుతమ ♦ కిచ్చునె యెచ్చటనైన లేఁ
గలన్, గుడువఁగనీనిచోఁ ‡ గెరలి ♦ గోవులు తన్నునుగాక
భాస్కరా. 4

టీ. భాస్కరా! (మనుష్యుఁడు) లోభవర్తియై = లుబ్ధత్వము కలవాఁడై (ధనమందాశకలవాఁడై యనుట) అడిగిన అట్టియాచకుల ఆశలు = కోరునట్టి యాచకులయొక్క కోర్కులు, ఎఱుంగక = తెలిసికొనక, కడపినన్ = పంపినచో, ఒకానొక అప్పుడు = ఒకానొక వేళయందు, వానికిన్ = అలుబ్ధునకు, ధర్మదేవత = దైవము, ఈదు = ఈయదు, అ ఎడలన్ = అట్టిసమయములయందు, అది + ఎట్లు = అదియెట్లనిన, లేఁగలన్ = దూడలను, కుడువఁగన్ + ఈనిచోన్ = కుడుచుకొననీయని, యెడల (పాలుత్రాగనీయనియెడల) గోవులు = ఆవులు, కెరలి = కోపము తెచ్చుకొని, తన్నును కాక = తన్నుచుండునుగాని, పాలుతమకున్ = అన్నిపాలును బిదుకుకొన నెంచువారికి, ఇచ్చును + ఎ = ఇచ్చునా? (ఈయవు)

తా. అధికాశచే మనుష్యులు దూడలకు లేకుండ గోవులపాలన్నియుఁ దామే బిదుకుకొనవలెనని యెంచిన నావు లట్టివారికి పాలీయవు. అట్లుగాక మనుజుఁడు మితిమీఱిన యాశగలవాఁడై తన్ను గోరినవారికేమియు నీయకుండఁ దరిమినచో నట్టి లోభికిఁగూడ ధర్మదేవత యొసంగకుండును.

చ. అతిగుణహీనలోభికిఁ బదార్థముఁగల్గిన లేక యుండినన్
మితముగఁగాని కల్మిగల ♦ మీఁదటనైన భుజింపఁడింపుగా

‡ కెరలు:-అతిశయించు, ఆగ్రహించు, కూయు, విజృంభించు, సంభ్రమించు, అని యర్థములు.



సతమని నమ్ము దేహమును ♦ సంపద నేఱులు నిండిపాఱినన్
గతుకఁగఁజూచుఁగుక్కతన ♦ కట్టడమీఱక యెందు భాస్కరా.

టీ. భాస్కరా, అతి = మిగుల, గుణ = సద్గుణములచేత, హీన = కొఱఁతయగు (అనఁగా గుణహీనునకు అనుట) లోభికిన్ = లుబ్ధునకు, పదార్థము = ద్రవ్యము, కల్గినన్ = ఉన్నప్పుడును, లేక ఉండినన్ = లేని వేళయందును, మితముగన్ = తగినట్లే, భుజించును, కాని, కల్మి = భాగ్యము, కలమీఁదటనైనన్ = ఉన్నతర్వాతనైనను, ఇంపుగాన్ = ఇష్టముగా, భుజింపఁడు, = క్షీంపఁడు (తినఁడు), దేహమును = ఒడలును, సంపదన్ = భాగ్యమును, సతముఅని = శాశ్వతమని, నమ్మున్ = విశ్వసించును (ఎట్లనఁగా. ఏఱులు = నదులు, నిండి = [నీటిచే] పూర్ణమయి, పాఱినన్ = ప్రవహించినను, కుక్క = శునకము, ఏదుటన్ = ఎచ్చోటనైనను, తనకట్టడన్ = తన కట్టుబాటును, మీఱక = దాటక, [తప్పక] కతుకఁగన్ = నాలుకతో నందుకొనుటకే, చూచున్ = కనిపెట్టుకొని యుండును.

తా. నదులుపరిపూర్ణజలముతో నిండియున్నను, ఉదకముతక్కువయైయున్నను, కుక్క తనస్వభావమును విడలక నాలుకతోఁ గతుకును గాని త్రాగనేరదు. అవిధముగా లోభి తనకెంతభాగ్యమున్నను లేకయున్నను దగినంతే భుజించునుగాని సంపద కలిగియున్నను జక్కఁగా భుజింపనేరఁడు.

చ. అదను దలంచి కూర్చిప్రజ ♦ నాదరమొప్పవిభుండుకోరినన్
గదిసి పదార్థ మిత్తురటు ♦ కాసక వేగమె కొట్టితెండనన్
మొదటికిమోసమౌఁబొదుగు ♦ మూలముగోసినఁబాలుగల్గునే
పిదికినఁగాక భూమిఁబశు ♦ బృందము నెవ్వరికైన భాస్కరా. 6

టీ. భాస్కరా! విభుండు = ప్రభువు, [రాజు] అదను = తఱిని (సమయమును) తలఁచి = ఆలోచించి. కూర్చి = ప్రియముచేసి (ఆనందింపఁజేసి) ప్రజన్ = మానవులను, ఆదరము + ఒప్పన్, గౌరవమొప్పునట్లుగా, కోరినన్, (ద్రవ్యమును అడుగఁగా, కదిసి (ఆరాజును చేరి పదార్థము =

ధనము, ఇత్తురు=ఇచ్చెదరు, అటుగానక=ఆవిషయమును విచారింపక, వేగము + ఎ=వెంటనే. కొట్టి (జనులను) బాధించి, తెండు = తీసికొనిరండు. అనన్=అనినచో, మొదటికిమోసము + ఔను = మొదటనే చెడిపోవును (వానినివిడచిపోదురనుట) ఎట్టులనగా, భూమిన్ = పుడమియందు, పశుబృందమున్=ఆవులగుంపును, పిదికినఁగాక = పిండినఁ బాలువచ్చునుగాని, పొదుగుమూలము=పొదుగు మొదటిభాగమును, కోసినన్=కత్తితోఁ దెగఁగోసినయెడల, ఎవ్వరికైనన్=ఎంతటివారికయినను, పాలు = క్షీరము, కలుగునె=వచ్చునా! (రావనుట)

తా. గోవులను మనుజుఁడు నెమ్మదిగాఁ జేతులతోఁ బితికిన పాలువచ్చునుగాని, ఆపొదుగును కత్తితోఁగోసిన పాలుండవుసరికదా ఆవులేనశించును. ఆవిధముగా రాజయినవాఁడు తనరాజ్యములోని ప్రజలను మంచిగా నడిగినఁగప్పములు చెల్లింతురుగాని, బలాత్కరించిన ధనమియ్యకపోవుటయే గాక దేశమునువిడిచి పారిపోవుదురు.

చ. అనఘునికైనఁ జేకుఱు నన♦ర్హుని గూడి చరించునంతలో
మన మెరియుంగ నప్పుడవ♦మానము కీడు ధరిత్రియందు
నే, యనువుననైనఁదప్పవుయ♦థార్థము; తానదియెట్టులన్న
చో, నినుమునుగూర్చి యగ్ని నల♦యింపదె సమ్మెటపెట్టు
భాస్క.రా. 7

టీ. భాస్కరా! ధరిత్రియందున్=పుడమియందు, అనర్హు=అర్హుడుకానివానిని, [అయోగ్యుని] కూడి=చరించినంతలో = తిరుగునట్టివేళయందు, మనము=చిత్తము, ఎరియంగన్=మండునట్లు, అప్పుడు=ఆసమయమందే, అవమానము=అగౌరవము, కీడున్=చెడుగును, అనఘునికైనన్=దోష (పాప) రహితుఁడయిన వానికయినను, చేకురున్=కలుగును, ఏ + అను

6. పాలకై పొదుగుఁ గోయువారుందురా? సామ్యము.



వునన్ + ఐనన్=ఏయుపాయముచేనయిన, తప్పవు=తప్పిపోవు, యథార్థము=నిశ్చయము. తాన్ + అది + ఎట్టులు + అన్నచోన్=అయ్యది ఎట్లనఁగా, ఇనుమునుగూర్చి= ఇనుముతో సంబంధముండుటచే, అగ్నిన్=నిప్పును, సమ్మెటపెట్టు=సుత్తిదెబ్బ, అలయింపదె = వెతఁబెట్టదా (బాధింపదా) బాధించుననుట.

తా. ఇనుముతోఁగూడ నగ్నికి సమ్మెటపెట్టుతప్పనట్లు చెడ్డవాని సావాసముచేసిన మంచివానికిని అగౌరవమును చెడుగును, గలుగుచుండును. ఎట్లయినను తప్పిపోవు.

చ. అలఘుగుణ ప్రసిద్ధుఁ డగు♦నట్టిఘనుం డొకఁడిష్టుఁడై తనున్
వలచియొకించు కేమిడిన ♦ వానికి మిక్కిలి మేలుచేయుఁగా
తెలిసికుచేలుఁడొక్కకొణి♦దెండడుకుల్దనకిచ్చినన్ మహా
ఫలదుఁడుకృష్ణుఁడత్యధిక♦భాగ్యములాతనికీఁడె! భాస్కరా.

టీ. భాస్కరా! అలఘు=ఘనమైన, గుణ=సద్గుణములచే, ప్రసిద్ధుఁడు=పొగడ్తకెక్కినవాఁడు, అగునట్టి ఘనుండు = అయినమహానుభావుఁడు, ఒకడు=ఒకానొకఁడు, ఇష్టుఁడు + ఐ = స్నేహితుఁడై, తనున్ = తన్ను, వలచి = ప్రేమించి, ఒక + ఇంచుక =స్వల్పముగా, [కొంచెము] ఏమి + ఇడినన్=ఏదియిచ్చినను, వానికిన్=ఆయిచ్చినయతనికి, మిక్కిలి=ఎక్కువ, మేలు=మంచిని, చేయుఁగా = యొనర్చుచుండునుగదా! తెలిసి = (దేవుఁడని) ఎఱిగికొని, కుచేలుఁడు = కుచేలుఁడను నొక విప్రుఁడు, ఒక్కకొణిదెండు=ఒకచేరెఁడు, అడుకుల్=అడుకులను, తనకున్=తనకు [కృష్ణునకు] ఇచ్చినన్=ఈయఁగా. మహాఫలదుఁడు=గొప్పఫలమునిచ్చునట్టి, కృష్ణుఁడు, అతనికిన్=ఆకుచేలునకు, అతి + అధిక భాగ్యములు=మిక్కిలియెక్కువయిన ఐశ్వర్యములు, ఈఁడె=ఈయఁడా! [ఇచ్చెననుట]

7. ఇనుముతోఁగూడిన అగ్నికిఁగూడ సమ్మెటపెట్టునట్లు సామ్యము.

తా. కృష్ణమూర్తికిఁ గుచేలుఁడు భక్తితోఁ జేరెఁడడుకులీయఁగా, నతనికి మిక్కిలి యెక్కువయిన భాగ్యములనొసంగినట్లె గుణముగలవాఁడు తనకుఁ బ్రియుండైయుండి యే స్వల్పమాతని కిచ్చినను అతఁడు అధికఫలమునే యొసంగును.

చ. అవనివిభుండు నేరుపరి ♦ యై చరియించినఁ గొల్చువార లె
ట్లవగుణులైననేమి పను ♦ లన్నియుఁ జేకుఱు వారిచేత నే
ప్రవిమలనీతిశాలి యగు ♦ రాముని కార్యము మర్కటంబులే
తవిలియొనర్పవే! జలధి ♦ దాటిసురారులఁ ద్రుంచిభాస్కరా.

టీ. భాస్కరా! అవనివిభుండు = పుడమిఱేఁడు, [రాజు] నేరుపరియై=నిపుణతకలవాఁడై, చరియించినన్ = సంచరించినయెడల, కొల్చువారలు=సేవించువారు. సేవకులు, ఎట్లు=ఎట్టి, అవగుణులు=చెడ్డగుణములు గలవారు. అయిననేమి=అయినను, వారిచేతనే = అట్లు చెడుగుణములు గలవారిచేతనే, పనులన్నియున్=ఎల్లకార్యములును, చేకురున్=సమకూరును, (ఎట్లనఁగా) ప్రవిమల=నిర్మలమయిన, నీతిశాలి = రాజనీతిచేఁ బ్రకాశించువాఁడు, అగు రాముని కార్యము=అయినట్టి శ్రీరామచంద్రునిపని, మర్కటంబులు + ఏ=కపులే (కోఁతులే) తవిలి=పూని, జలధిన్=సాగరమును (సముద్రమును] దాఁటి=లంఘించి [తరించి) సుర + అరులన్=దైత్యులను (రాక్షసులను] త్రుంచి=చంపి, ఒనర్పవే=చేసినవికావా ? (అనఁగాఁ బయిన చెప్పిన శ్రీరాముని కార్యమునను.)

కుచేలుఁడు:—శ్రీకృష్ణుని సఖుఁడయిన యొకబ్రాహ్మణుఁడు ఇతడు బ్రహ్మవేత్తయు, విజితేంద్రియుఁడును, అయినను దారిద్ర్యపీడితుఁడై భార్య ప్రేరేపింపఁగా ధనమునుగోరి కృష్ణుని దర్శనమునకుఁబోఁగా నతఁడితని మిగుల గారవించి తనయందుఁగల భక్తివిశ్వాస మనోరథంబులను యెఱింగి యతని మహదైశ్వర్యయుక్తునిగఁజేసెను.



తా. నీతిశాలియగు శ్రీరాముఁడు, అల్పములగు కపులచేతనే సముద్రముదాఁటుట, రాక్షసులను జంపుట మున్నగు పనులను నెరవేర్చుకొనునట్లు నేర్పరియగు రాజల్పులగు భటులచేత నేఘనకార్యములొనరించుకొనఁగలఁడు.

ఉ. ఆదరమింత లేక నరుఁ ♦ డాత్మబలోన్నతి మంచివారికిన్
ఖేదముచేయుటం దనదు ♦ పేర్మికిఁ గీడగు మూలమెట్లను
ర్వ్యాదహిరణ్య పూర్వకశి ♦ పద్దనుజుండుగుణాఢ్యుఁడైన ప
ప్లాదుని కెగ్గుచేసి ప్రళ ♦ యంబునుబొందఁడెమున్నుభాస్కరా

టీ. భాస్కరా! నరుఁడు = మనుష్యుఁడు, ఆదరము = మక్కువ (ప్రేమ) ఇంతలేక=ఇంచుకయినలేక, ఆత్మబల + ఉన్నతిన్=(నిజ)తనబలాధిక్యతచేత; మంచివారికిన్=సత్పురుషులకు, ఖేదము=దుఃఖము (బాధ) చేయుటన్=కలిగించుటచేత, తన పేర్మికిన్=తన కూర్మికి, కీడు అగున్ =

రాముఁడు:—విష్ణువుయొక్క దశావతారమూర్తులలో నేడవమూర్తి. ఇతఁడు ఇక్ష్వాకువంశసంభవుఁడయిన యజమహారాజుకొడుకైన దశరథునికి కౌసల్యయందు జనియించిన పుత్త్రుఁడు. భార్యసీత. తమ్ములుభరత,లక్ష్మణ, శత్రుఘ్నులు, ఇతఁడు భార్యతోను. తమ్ముఁడగులక్ష్మణునితోనుపితృవాక్యపరిపాలనము చేయుటకుఁ బదునాలుగువత్సరములు, అరణ్యవాసము చేసి రావణకుంభకర్ణాది, రాక్షసులఁజంపి దండకారణ్యవాసులగు బ్రాహ్మణులకు సుఖముగలుగఁజేసెను. మఱియు నితనికి దశరథుకొమరుఁడగుటచే దాశరథియనియు, కకుత్స్థునివంశమునజనియించుటచే, కాకుత్స్థుఁడుఅనియు, రఘుకులమునందుఁ బుట్టినందున రాఘవుడనియు నామములుకలిగెను. పూర్వముదేవాసురుల యుద్ధమున దైత్యులకు క్షేమముఁగోరుచుండిన భృగుమహర్షి తన పత్నిని విష్ణువుశిరచ్ఛేదముచేసెనని కోపించి విష్ణువునుమానవుఁడుగాఁ బుట్టునట్లును. పత్నీవియోగ దుఃఖమును అనుభవించునట్లును, శపించినందున రాముఁడు కేవలమనుష్యమాత్రుఁడయి సీతావియోగదుఃఖము ననుభవించెను.

చెడుగు కలుగును, మూలము=నిదర్శనము. ఎట్లు=ఏవిధమున, మున్ను=పూర్వకాలమందు, అమర్యాదన్=చెడునడవడిచే, హిరణ్య=హిరణ్య శబ్దము, పూర్వ=మొదటఁగల, కశిపు + అన్=కశిపుఁడను (అనఁగా హిరణ్యకశిపుఁడనుట), దనుజాఁడు=రాత్రించరుఁడు (రాక్షసుఁడు) గుణ + అఢ్యుఁడు = సుగుణములకు ప్రభువు (అన్ని సుగుణములను దనయందుఁగలవాఁడనుట) ఐన= అయినట్టి, ప్రహ్లాదునకున్ = ప్రహ్లాదునకు, ఎగ్గు=అపకారము, చేసి, ప్రళయంబును = వినాశమును [హానిని] పొందఁడు + ఎ=పొందఁడా, అనఁగా మృతినందె ననుట.

తా. పూర్వకాలమున దుష్టుఁడగు హిరణ్యకశిపుఁడు మంచి గుణవంతుఁడగు ప్రహ్లాదునిపై బగఁగొనినచ్చినట్లే మానవుఁడు జగంబుననిందుకయు ప్రేమలేక బలములేనియోగ్యునిబాధించినచోఁదప్పకుండమృతినొందఁగలఁడు

ఉ. ఆరయ నెంతనేరుపరి♦యై చరియించిన వానిదాపునన్
గౌరవ మొప్పఁగూర్చు నుప♦కారి మనుష్యుఁడు లేక మేలుచే
కూరదదెట్లు? హత్తుగడ♦గూడనునేనూడఁ బదాఱువన్నె బం
గారములోననైన వెలి ♦ గారముకూడకయున్న భాస్కరా.

10. ♦హిరణ్యకశిపుఁడు:—ఒకానొక రాక్షసరాజు. ఇతఁడు కశ్యపునకు దితియందుఁబుట్టినకొడుకు, ఈతఁడు ను, ఈతనితమ్ముఁడగుహిరణ్యాక్షుఁడును సనకసనందనులశాపముచేరాక్షసులైపుట్టిన విష్ణుద్వారపాలకులగు జయవిజయులు. వీరుమహత్తరమగు తపముసలిపిబ్రహ్మరుద్రులవలన ననేకవరములను బడసి దేవతలకునుమనుష్యులకును పెక్కుబాధలనొనరించిరి. వీనితమ్ముఁడగు హిరణ్యాక్షుని విష్ణువు సూకరాకారమున సంహరించియు, వీనినినరసింహరూపమున నవతరించియు సంహరించెను. ప్రహ్లాదుఁడు:—వీని కుమారుఁడు విష్ణుభక్తుఁడు. అయిదు సంవత్సరములు ప్రాయమున నే భగవంతుని ప్రత్యక్షము చేసికొనిన మహానుభావుఁడు. మంచి గుణము లన్నియు వీనియందే కలవు.



టీ. భాస్కరా! ఆరయన్=విచారింపఁగా, [మనుజుఁడనుట; ఎంత నేరుపరి=చాల నేర్పుగలవాఁడు, అయి చరించినన్ = అయి సంచరించుచున్నను [తిరుగుచున్నను] వానిదాపునన్ = వానిసమీపమున [వానిదగ్గఱ] గౌరవము = మర్యాద [ఘనత] ఒప్పన్ = ఒప్పునట్లు, కూర్చు + ఉపకారి మనుష్యుఁడు=ఘటింపఁజేయు నుపకారముజేయువాఁడగు మనుజుఁడు, లేక, మేలు=మంచి, చేకూరదు=కలుగదు. అది + ఎట్లు=అది యేవిధమువనఁగా చూడన్=కనుఁగొనఁగా (విచారణసేయఁగా) పదాఱువన్నెబంగారములోనన్ + ఐనన్ = మేలిమిబంగారులోనైనను, వెలి + కారము = బంగారమునకుఁ గాంతిఁగలుగఁజేసెడి యొకదినుసు తెల్లనియుప్పు, (టంకణము) కూడ + ఉన్నన్ = చేరకున్నయెడల; హత్తుగడ గూడును + ఎ=అంటుకొనునా ! అంటుకొన నేరదనుట.)

తా. పదునాఱువన్నె బంగారము అయినప్పటికిని టంకణమును వెలిగారమును బెట్టకున్నచో నతుకుకొననిరీతిగా మనుష్యుఁడు తానెంత తెలివితేటలు కలవాఁడైనను వానియొద్ద మర్యాదను గలుగఁజేయు నుపకారిలేకున్న మంచి కలుగ నేరదు.

ఉ. ఈక్షితి నర్థకాంక్ష మది♦ నెప్పుడుపాయక లోకులెల్లసం
రక్షకుఁడైన సత్ప్రభుని♦రాకల గోరుదు రెందుఁజంద్రి
కా, పేక్షఁజెలంగిచంద్రుఁడుద♦యించువిధంబునకై చకోర
పుం, బక్షులు చూడవేయెను ర♦ పారముదంబునుబూని
భాస్కరా.

టీ. భాస్కరా! ఈక్షితిన్=ఈయవనియందు, ఎల్లలోకులు=అందఱుమనుజులును, అర్థకాంక్షను=ద్రవ్యమునందలి కోరికను, ఎప్పుడు=ఎల్లకాలమును, పాయక=విడువక, (వదలక) సంరక్షకుఁడు=(తమ్ము) కాపాడెడువాఁడు, ఐనసత్ + ప్రభునిరాకలు = అయినట్టి మంచిరాజుయొక్క వచ్చుటలను, ఎందున్=యే వేళయందైనను, కోరుదురు=అపేక్షింతురు.

ఎట్లులనఁగాఁ చకోరపుఁబక్షులు=వెన్నెలపిట్టలు, చంద్రికా + అపేక్షన్= వెన్నెలయందలి కాంక్ష ఆసక్తిచే) చెలంగి = సంతోషముకలవై యుండి, చంద్రుఁడు=శశి, (చందమామ) ఉదయించు విధంబునకున్ + ఆయి = పుట్టుకకయి। (చంద్రోదయమునకై) అపార =హద్దులేని. ముదంబును=సంతోషమును, పూని = వహించి, (పొంది) ఎదురుచూడవే = కనిపెట్టుకొని, యుండవా ? (అనఁగా వేచియుండుననుట)

తా. వెన్నెలనుగోరి చకోరపక్షులు మిక్కిలి యానందమును జెందును. చంద్రుఁ డెప్పుడుదయించునోయని కనిపెట్టుకొనియుండు విధముగా, మనుష్యులు ద్రవ్యమందాసచేఁ బ్రభువురాకకై నిరీక్షించుచుందురు.

ఉ. ఈ జగమందుఁ దా మనుజుఁ ♦ డెంతమహాత్మకుఁడైన దైవ
మా తేజముతప్పఁ జూచునెడఁ ♦ ద్రిమ్మరికోల్పడు నెట్ల
నన్మహా, రాజకుమారుఁడైన రఘు♦ రాముఁడుగాల్నడఁగా
యలాకులున్, భోజనమై తగన్వనికిఁ బోయి చరింపఁడె?
మున్ను భాస్కరా. 13

టీ. భాస్కరా! మనుజుఁడు = మనుష్యుఁడు, తాన్=తాను, ఈజగమందున్=ఈప్రపంచమందు, (ఈలోకమున) ఎంతమహాత్మకుఁడు=ఎంతగొప్పవాఁడు, ఐనన్ = అయినను, దైవము = భగవంతుఁడు. ఆ తేజము =ఆమహాత్తు (ప్రభావము) తప్పన్=తప్పినట్లుగా, చూచు + ఎడన్=కనుగొనునట్టివేళయందు, త్రిమ్మరి = తిరిగి, కోలు + పడున్ = పోఁగొట్టుకొనును, (ఎట్లులనఁగా) మహారాజకుమారుఁడు=రాజులకురాజగు దశరథునిపుత్రుఁడు, ఐనరఘురాముఁడు=(నయినరఘువంశమునఁబుట్టిన) రాముఁడు, కాయలు = పండ్లును, ఆకులు = పత్రములును, భోజనము అయి =అహారమయి (తిండిగా

12. ♦ చకోరము=చంద్రకిరణములను దినునది, చక్రవాకము=సూర్యకిరణములను దినునది.



నయి) తగన్=తగునట్లు, (ఒప్పునట్లు) కాల్ + నడన్=కాలినడకతో, వనికిన్=అరణ్యమునకు, (అడవికి) పోయి=వెళ్ళి, చరింపఁడు + ఎ=సంచరింపలేదా ? (తిరుగలేదా) అనఁగాఁ దిరిగెననుట,

తా. రామచంద్రుఁడు కాలినడకతో నడవికేగి, ఆకుల, నలముల నాహారముగఁ జేసికొని సంచరింపవలసి వచ్చినట్లె మనుష్యుఁడు తా నెంతటి గొప్పవాఁడయినను దైవవశమున సర్వమును బోఁగొట్టుకొని దేశములు పట్టుకొని తిరుగుచుండును.

చ. ఉరుకరుణాయుతుండు సమ♦ యోచితమాత్మఁదలంచి యు
గ్రవా, క్పరుషతఁజూపినన్ ఫలము♦ గల్గుట తథ్యముగాదె
యంబుదం, బుఱిమినయంతనే కురియ♦కుండునె వర్షము లోక
రక్షణ, స్థిరతరపౌరుషంబున న♦ శేషజనంబు లెఱుంగ
భాస్కరా. 14

టీ. భాస్కరా! ఉరుకరుణాయుతుండు=ఘనమయినదయతోఁ గూడుకొనినవాఁడు, సమయ + ఉచితము=కాలమునకుఁదగినది. (ఆలోచన)ఆత్మన్ =చిత్తమునందు, తలంచి=తలపోసి. ఉగ్ర + వాక్ పరుషతన్=భయంకరమగుపలుకులయొక్క కాఠిన్యమును. చూపినన్=అగపరచినను, ఫలము=లాభము, కల్గుట=సంభవించుట (ప్రాప్తమగుట) తథ్యముకాదు + ఎ=నిజమేకదా, (ఎట్లనిన) అంబుదము=మేఘము (మబ్బు) ఉఱిమిన + అంతన్ + ఏ=ఉఱిమినంత మాత్రముననే, లోక=ప్రజలను, రక్షణ=కాపాడుటయందు, స్థిరతర=మిక్కిలి స్థిరమైన(నిశ్చయమైనయనుట) పౌరుషంబునన్=శౌర్యముచేత, అశేష జనంబులు=ఎల్లమానవులును. (అందఱు మనుష్యులు ననుట) ఎఱుంగన్= తెలియునట్లు, వర్షము=వాన, కురియక=వర్షింపక, ఉండును + ఎ=ఉండునా ! (అనఁగా గురిపించుననుట)

తా. మేఘము ప్రారంభమున నురుములచేఁ బ్రజలను భయపెట్టినను తరువాత ప్రజలను వర్షమునచే నానందపరుచునట్లే దయావంతుఁడు సమయానుసారముగా నొకకఠినపుఁబలుకుఁబలికినను దరువాతఁ దప్పక మేలును గలిగించును.

చ. ఉరుగుణవంతుఁ డొడ్లు దన ♦ కొండపకారము సేయునప్పుడుం
బరహితమే యొనర్చు నొక ♦ పట్టుననైనను గీడుఁ జేయఁగా
నెఱుఁగఁడు నిక్కమే కదయ ♦ దెట్లనఁ గవ్వముఁ బట్టి యెంతయున్
దరువఁగఁ జొచ్చినం బెరుఁగు ♦ తాలిమి నీయదె? వెన్న భాస్కరా.

టీ. భాస్కరా! ఒడ్లు=ఇతరులు, తనకుఁ=తనకు, ఒండు+అపకారము=ఒకకీడు, చేయు+అప్పుడుఁ=చేయునప్పుడయినను, ఉరుగుణవంతుఁడు=ఘనమైన గుణములు గలవాఁడు, పరహితము+ఎ=అన్యులకు (ఇతరులకు) మేలునే, ఒనర్చుఁ=చేయును, ఒక పట్టునన్+ఐనను=ఒకసమయమునందైనను (అనఁగా నెప్పుడైననను టు) కీడు=చెఱుపును, చేయన్+కాన్=ఒనర్చుటకు, ఎఱుఁగఁడు=తెలిసికొనఁడు. (తలపోయఁడనుట) నిక్కము+ఎకద=సత్యమేకదా, (నిజమేకదా) (ఎట్లనఁగా ఇతరులు అని తెచ్చిపెట్టుకొనవలెను.) పెరుఁగు=దధి, కవ్వమున్+పట్టి=కవ్వమును పట్టుకొని, ఎంతయుఁ=మిగుల, తరువఁగఁ+చొచ్చినన్=మథించుచున్నను (చిలుకుచున్నను) (పెరుగుకర్త) తాలిమిన్=ఓర్పుచే, వెన్నఁ=నవనీతమును, ఈయదు+ఎ=ఈయదా! ఇచ్చుచున్నదనుట.]

తా. మనుష్యులు తన్ను గవ్వమున మథించుచున్నను వారికేమియుఁ గీడుసేయక పెరుఁగు జనులకుఁ దనయందున్న వెన్న నొసంగుచున్నట్లె సద్గుణములు కలవాఁడు తనకుఁ బరులు కీడు సేయుచున్నను తా నితరులకు మేలే యొనర్చును గాని కీడు నొనర్పఁడు.

15 ఒడ్లు=ఇతరులు, ధాన్యము అని అర్థములు. "గుప్పెడు దూసరొడ్లు" అని ఘట్టుప్రభుని కుచేలోపాఖ్యానమునందలి ప్రయోగము.



చ. ఉరుబలశాలినంచు దను ♦ నొల్లని యన్యపతివ్రతాంగనా
సురతముఁ గోరినేని కడ ♦ సుమ్మది భూతికిఁ బ్రాణహానియౌ
శిరములు గూల రాఘవుని ♦ చే దశకంఠుఁడు ద్రుంగిపోవఁడే
యెఱుఁగక సీతకాసపడి ♦ యిష్టులభృత్యులఁ గూడి భాస్కరా.

టీ. భాస్కరా! (మనుష్యుఁడనునది తెచ్చి పెట్టుకొనవలెను.) ఉరు=అధికమైన, బలశాలిన్+అంచు=బలముగలవాఁడనని. తనున్=తన్ను, ఒల్లని=ఇష్టపడని (ఒప్పుకొనని) అన్య=వేఱొక, [ఇంకొక] పతివ్రతా+అంగనా=పాతివ్రత్యముగల స్త్రీయొక్క, సురతము=సంగమము. కోరన్+ఏని=వాంఛించినచో, అది=ఆవాంఛించుట, [ఆకోరుట) భూతికిన్=ఐశ్వర్యమునకు (సంపదకు] కడసుమ్ము=చివరసుమీ! అంత్యదశయనుట. అనఁగా నాశనమగుననుట) ప్రాణహాని=చావు, ఔన్=

16. దశకంఠుఁడు=రావణుఁడు, రాక్షసరాజు, ఇతని రాజధాని లంక. తండ్రి పులస్త్యుని కొడుకగు విశ్రవసుఁడు, తల్లి సుమాలి కూఁతురగు కైకసి. భార్య మయుని కూఁతురగు మందోదరి. సోదరులు కుంభకర్ణవిభీషణులు. కొడుకులు ఇంద్రజిత్తు మొదలగువారు. ఇతనికిఁ బదితల లుండుటచే దశకంఠుఁడు దశగ్రీవుఁడు అను నామధేయములు గలిగెను, మఱియు నితఁడు మహత్తరమగు తపము సలిపి బ్రహ్మవలనఁ దనకు మనుష్యులు తక్కఁ దక్కినవారిచేఁ జావులేకుండ వరముఁబొంది యావరప్రభావమున మిగుల గర్వితుఁడయి త్రిలోకవాసులగు సాధువులను, ఎల్లవారిని మిగుల బాధించుచుండెను. ఆహింస కోర్వఁజాలక మునులును దేవతలును బ్రహ్మచెంతకుఁ బోయి మొరలిడిరి, అప్పుడు బ్రహ్మ వారినిఁ వెంటబెట్టుకొని పాలసముద్రమునందు విష్ణువుదగ్గఱకుఁబోయి ప్రార్థింపఁగా నతఁడు మనుష్యరూపమున శ్రీరాముఁడను పేర భూమియందవతరించి యీదశకంఠునిఁ జంపెను ఈదశకంఠుఁడును కుంభకర్ణుఁడును. శాపగ్రస్తులయిన జయవిజయుల రెండవ జన్మము గలవారు.

అగును. [ఎట్లనిన] దశకంఠుఁడు=రావణాసురుఁడు, ఎఱుఁగక=అజ్ఞానము (తెలిసికొనక) సీతకున = సీతాదేవి నిమిత్తము, ఆసపడి =ఆశఁజెంది, ఇష్టులన్ = స్నేహితులను, భృత్యులన్ = సేవకులను, కూడి = కలిసికొని, రామునిచేన్ = శ్రీరామచంద్రునిచే, శిరములు = తలలు, కూలన్ = తెగిపడఁగా, త్రుంగిపోవఁడు + ఏ=మృతినొందలేదా ? (చచ్చెననుట )

తా. క్రొవ్వుచేఁ గ్రిందుమీఁదెఱుఁగక రావణుఁడు సీతనుగోరి బంధుభట సమేతుండై యుద్ధమునఁ జచ్చెను. కాఁబట్టి మనుష్యుఁడు నేను బలముగలవాఁడనని కావరమునఁ దనయందిష్టములేని స్త్రీని గవయఁగోరిన నైశ్వర్యహానియుఁ బ్రాణహానియుఁ గలుగును.

ఉ. ఊరకవచ్చుఁ బాటుపడ♦కుండిననైన ఫలంబదృష్టమే, పా
రఁగఁగల్గువానికిఁ బ్ర♦యాసమునొందిన దేవదానవుల్ వా
రలటుండఁగా నడుమ♦ వచ్చినశౌరికిఁగల్గెఁగాదెశృం, గార
పుఁబ్రోవు లక్ష్మియును♦గౌస్తుభరత్నము రెండు భాస్కరా.

టీ. భాస్కరా! అదృష్టము = భాగ్యము! ఏపారఁగన్ = వృద్ధియగునట్లు, కల్గువానికిన్ = ఉన్నమానవునకు. పాటు=ఆయాసము,[శ్రమ) పడకయుండినన్ = పొందకున్నను, ఫలంబు = లాభము, ఊరక=మిన్నక, వచ్చున్ = వచ్చుచుండును. (ఎట్లనఁగా] ప్రయాసమున్=కష్టమును.(శ్రమ) ఒందిన దేవదానవుల్=పొందిన సురలును అసురులును, వారలు=ఆదేవతలు రాక్షసులు,అటు + ఉండఁగాన్=ఆవిధముగా, [శ్రమపడినవారై] నుండగా శృంగారపుఁబ్రోవు = అందములకుప్పయగు, లక్ష్మియును= శ్రీదేవియును కౌస్తుభరత్నము = కౌస్తుభమాణిక్యము, రెండున్ =రెండును, నడుమన్= మధ్యకాలమున, వచ్చిన శౌరికి=ఏతెంచిన విష్ణుమూర్తికి, కల్గెన్ + కాదు + ఎ =లభించెనుగదా, [దొరకెనుగదా !)

తా. అహోరాత్రములు శ్రమపడుచుండునట్టి దేవతలురాక్షసులునుండఁగా వారికిఁగాకుండ సముద్రమథనసమయమున జనించిన లక్ష్మియు



గౌస్తుభమును కష్టపడకుండనడుమ నేతెంచినవిష్ణుమూర్తికిదొరికిన విధముగా మహాదృష్టవంతునకు శ్రమపడ నక్కఱలేకయే ఫలప్రాప్తి యగుచుండును.

ఉ. ఊరక సజ్జనుం డొదిఁగి♦ యుండిననైన దురాత్మకుండుని
ష్కారణమోర్వలేక యప♦ కారముచేయుట వానివిద్యగా
చీరలు నూఱుటంకములు♦చేసెడివైనను బెట్టెనుండఁగాఁ
జేరి చినింగిపోఁగొఱుకు♦చిమ్మటకేమిఫలంబు భాస్కరా !

టీ. భాస్కరా! సత్ + జనుండు=సజ్జనుండు (యోగ్యుఁడు మంచివాఁడు) ఊరక=ఎవరిజోలికినిబోక, ఒదిఁగి=అణఁగి, ఉండినన్ + ఐనన్ = ఉన్నప్పటికిని, దుర్ + ఆత్మకుండు = దురాత్మకుండు = చెడుమనస్సుకలవాఁడు, నిష్కారణము,=నిట్టపంట, (కారణములేకుండ) ఓర్వలేక=సహింపఁజాలక. అపకారము = అపకృతి (చెడుపని) చేయుట=ఒనర్చుట (సజ్జనునకపకారముచేయుట యనిభావము) వానివిద్యగా=అతనివిద్యయేకదా ! (అతనిచేతనైనకార్యమనుట (ఎట్లనఁగా) చీరలు=బట్టలు, నూఱుటంకములు = నూఱుదీనారములు (మొహరీలు); చేసెడివి=విలువఁగలవి, అయినను= అయినప్పటికిని, పెట్టెన్ = పెట్టెలో, ఉండఁగాన్=ఉన్నసమయమందు. చేరి=ప్రవేశించి, చినింగిపోన్=ఆవస్త్రములు శిథిలములగునట్లు, కొఱుకు = నములునట్టి = చిమ్మటకున్ = చిమ్మటయను నీలపురుగునకు, ఏమిఫలంబు= ఏమిలాభముకలదు. (లాభమేమియు లేదనుట)

---

17, ఫలము=లాభము, పండు, పంట, ప్రయోజనము, జాజికాయ, ప్రత్తికాయ, కేడెము, బాణము, ములికి, నాఁగటికఱ్ఱు, పందికొఱుచివరఅనిఅర్థములు. దేవదానవులు క్షీరసాగరమునుగడవగను, వాసుకినిత్రాడుగను మందరమును గవ్వముగనుజేసి యమృతముకొఱకు మథించుచుండఁగా నమృతము పుట్టక పూర్వము కొన్ని మంచివస్తువులందు బుట్టినవి. వానిలో లక్ష్మిదేవి, కౌస్తుభమణిని విష్ణుమూర్తి సంగ్రహించెను.

తా. వస్త్రములు నూఱు మొహరీలు సెలువగలవియైనను బెట్టెలోఁ బడియున్నప్పటికిని దనకేమియుఁ బ్రయోజనము లేకపోయినను జిమ్మటయా బట్టలను ముక్కలుముక్కలుగాఁ గొఱికివేయుచుండు విధముగా. ఎవరిజోలికింబోక యుత్తముఁడొకచోనణఁగియున్నను దుర్మార్గుఁడు తనకేమిలాభము లేకున్నను హేతువులేకుండ నాయుత్తమున కపకృతి సేయుచుండును.

ఉ. ఎట్టుగఁ బాటుపడ్డనొక ♦ యించుకప్రాప్తములేకవస్తువుల్
పట్టుపడంగనేరవు; ని♦బద్ధి సురావళిఁ గూడి రాక్షసుల్
గట్టుపెకల్చి పాల్కడలిఁ ♦ గవ్వముచేసిమథించిరంతయున్
వెట్టియెకాక యేమనుభ♦వించిరివారమృతంబు? భాస్కరా!

టీ. భాస్కరా! ఎట్టుగన్ = ఏవిధముగా, పాటుపడ్డన్ = శ్రమపడినను (కష్టపడినను) ఒక + ఇంచుక = ఏమాత్రమయిన, గొంచెము, ప్రాప్తము=పొందఁదగినది [అనఁగా నదృష్టమనిభావము; లేక, వస్తువుల్ = పదార్థములు (ద్రవ్యములనుట) పట్టుపడంగన్ నేరవు = దొరుకఁజాలవు. నిబద్ధి=(ఇది) సత్యము, (ఎట్లనఁగా రాక్షసుల్ = దైత్యులు, సుర + ఆవళిన్ — సురావళిన్ = దేవసంఘమును, (దేవతలయొక్క గుంపుననుట) కూడి=కలిసికొని, గట్టున్=పర్వతమును (అనఁగా మందరగిరియని భావము) పెకల్చి = ఊడఁదీసి, కవ్వముచేసి = మంథానముచేసి [పెరుగును జిలుకుటకేర్పడిన దండమనియర్థము) పాల్కడలిన్=క్షీరసాగరమును (పాలసముద్రమును) మథించిరి.=తరిచిరి (చిలికిరి) అంతయున్ = ఈపని యంతయును, వెట్టియకాక = ఏమియులాభములేనిదేకాని, వారు = దైత్యులు (రాక్షసులు) అమృతంబును=సుధను, ఏమి అనుభవించిరి.=ఏమి త్రాగిననారు? (అనఁగాఁ ద్రావలేదనుట.)

18. టంకములు = పదియాఱుడబ్బుల బంగారునాణెము, దీనారము టంకము=వెలిగారము. గడ్డపాఱ, నల్లవెలఁగ, కొాసె యులి. కత్తి, కత్తి రొుఱు, కోపము. అని యర్థములు.



తా. అసురులు సురులతో స్నేహముచేసి మందరాద్రిని బెకలించి తెచ్చి దానిం గవ్వముగాఁజేసి క్షీరసాగరమును శ్రమపడి మథించినను రాక్షసుల కించుకయు నమృతము చిక్కినదిగాదు, కాఁబట్టి మనుష్యుఁ డెంతటి యాయాసమునకుఁ బాల్పడినను దా ననుభవించుటకుయోగ్యమగుభాగ్యము. లేని తఱి తన కష్టమునకుఁ దగిన లాభముఁ గాంచనేరఁడు.

చ. ఎడపక దుర్జనుండొరుల♦కెంతయు గీడొనరించుఁ గానియే
యెడలను మేలుసేయఁడొక♦యించుకయైనను; జీడపుర్వు దా
జెడఁ దినునంతెకాకపుడి ♦ సెండుజలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్నపుష్పఫల♦భూరుహ మొక్కటినైన? భాస్కరా.

టీ. భాస్కరా! దుర్జనుండు = దుర్మార్గుఁడు, ఎడపక = వదలక, ఒరులకున్=అన్యులను, ఎంతయున్=చాల, కీడు=చెడుగును, ఒనరించున్ + కాని=చేయునుగాని, ఏ + ఎడలను = ఎప్పుడును, ఒక + ఇఁచుకయు + ఐనను=స్వల్పమయినను, మేలు=మంచిని, చేయఁడు=ఒనర్పనూహింపఁడు [ఎట్లనఁగా] చీడపుర్వు=చీడపురుగు, తాన్=తాను, చెడన్ = (ఫలవృక్షములు). పాడయిపోవునట్లు, తినున్ = భక్షించునుగాని, పుడిసెండు జలము=చేరఁడునీళ్ళను, ఇడి=పోసి, పొడవు=ఎదుగుట, అగుచున్న=కొంచుమన్న, పుష్ప=సుమములతోను (పువ్వులతోను) ఫల= పండ్లతోను, (కూడిన) భూరుహమున్=వృక్షమును (చెట్టును) ఒక్కటిన్ + ఐనన్= ఒకదానినైనను, పెంపన్ నేర్చునే = వృద్ధిఁజేయఁగలదా? అనఁగా బెంచగలదా యనుట) (పెంచలేదనుట.)

తా. చక్కఁగఁ బెరుగుచున్న ఫలవృక్షములను జీడపురుగు కొరికి తినుచుండును. గాని చేరఁడు నీళ్లు పోసి ఒక వృక్షమునైనఁ బెంచలేనట్లే,

19. అమృతంబు=సుధ, నీళ్లు, నెయ్యి, అయాచితవృత్తి, ముక్తి, యజ్ఞశేషము అని అర్థములు. పంచామృతములు =ఉదకము, పాలు పెరుగు, నెయ్యి, తేనె

దుర్మార్గుఁడు పరులకుఁ జాల కీడుసేయ నేర్చునే గాని యెవ్వనికిని మేలు సేయ నేరఁడు.

ఉ. ఎడ్డెమనుష్యుఁ డేమెఱుఁగు♦ నెన్ని దినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గల ♦ తోరపువర్తనలెల్లఁ బ్రజ్ఞఁబే
ర్పడ్డవివేకరీతి, రుచి♦ పాకము నాలుకగాక యెఱుంగునే?
తెడ్డది కూరలోఁ గలయఁ♦ద్రిమ్మరుచుండిననైన భాస్కరా.

టీ. భాస్కరా! ఎడ్డెమనుష్యుఁడు=మూఢుఁడు, ఎన్ని దినంబులు =ఎన్ని వాసరములు (అనఁగా నెన్ని రేయుంబవలులు అనుట) కూడియుండినన్=చేరియున్నను(కలిసియున్నను) దొడ్డగుణ + ఆఢ్యునందున్=చక్కని గుణములచే నొప్పుచున్న మనుష్యునియందు, కల తోరపు వర్తనలు + ఎల్లన్ =ఉన్న మంచినడతలన్నిటిని, ప్రజ్ఞచేన్=తెలివిచే (బుద్ధిచే) పేరు + పడ్డ వివేకరీతిః = ఖ్యాతినొందిన జ్ఞానవంతునివలె, ఏమి + ఎఱుంగును =ఏమి తెలిసికొనగలఁడు, (తెలిసికొనలేడనియర్థము.) (ఎట్లనఁగా) రుచిపాకము= మాధుర్యముయొక్క పరిపాకము, నాలుకగాక=జిహ్వగాక, తెడ్డు=కఱ్ఱ గరిటె, కూరలోన్ = కూరయందు, కలయన్=వ్యాపించునట్లు (అంతట ననుట) త్రిమ్మరుచు + ఉన్నను=సంచరించుచున్నప్పటికిని(తిరుగుచున్నను) అది=ఆ కొయ్యగరిటె, ఎఱుంగునే = తెలిసికొనఁగలుగునా (తెలిసికొన లేదనుట) రుచినని భావము

తా. చక్కఁగా బచనము చేయఁబడిన కూరయొక్క రుచి నాలుక తెలిసికొనును గాని, ఎప్పుడును నాయుడుకుచున్నప్పుడు నుడికీనతర్వాతను గూరలోనుండు తెడ్డు ఆ కూర రుచియెఱుంగనియట్లే గుణవంతునియందలి

21. దినము:—ఒక రాత్రియుఁ బవలును గలిసినది దినంబనబడును. రోజు అనునది హిందూస్తానీపదము. వారమనినను దినమనియే యర్థము. రుచి:—మాధుర్యము, కాంతి అని యర్థములు.



యుత్తమవర్తనములు జ్ఞానవంతుఁడు తెలిసికొనఁగలుగును గాని, వానితో నెన్ని దినములు కలిసియున్నను మూఢుఁడు తెలిసికొనలేఁడు.

ఉ. ఎప్పుడదృష్టతామహిమ♦యించుక పాటిలునప్పు డింపుసొం
పొప్పుచునుండుఁగాక యది♦యొప్పనిపిమ్మట రూపుమాయఁ
గ, నిప్పుననంటియున్న యతి♦నిర్మలినాగ్నిగురుప్రకాశముల్
దప్పిన నట్టిబొగ్గునకుఁ♦దా నలుపెంతయుఁ బుట్టు భాస్కరా.

టీ. భాస్కరా! ఎప్పుడు = ఏకాలమునందు. (ఏసమయమందు) అదృష్టతామహిమ = భాగ్యముయొక్క వృద్ధి, ఇంచుక=స్వల్పము (కొద్ది) పాటిలున్=కలుగునో, అప్పుడు=ఆవేళయందు, ఇంపుసొంపు = యొక్క చక్కదనము. ఒప్పుచునుండుఁగాక = ప్రకాశించుచుండును గాని, అది = ఆభాగ్యము, ఒప్పనిపిమ్మటన్=వదలినతరువాత, రూపు = పూర్వపురూపము, మాయుఁగా = చెడునుగదా! (నశించునుగదా) (అనగా రూపము మారుననుట.) (ఎట్లనఁగా) నిప్పునన్=వహ్నియందు, అంటియున్న=తగిలియున్న, అతినిర్మల=మిగుల స్వచ్ఛమయిన, అగ్ని=అగ్నియొక్క, గురు=ఘనములగు, (గొప్పవగు) ప్రకాశముల్=కాంతులు, తప్పినన్=వదలిపోయినచో, అట్టిబొగ్గునకున్=అటువంటి అంగారమునకు (నిప్పుచల్లారిన కట్టెతునుక) నలుపు=నీలిమ (నల్లనికాంతి) తాన్=తాను, ఎంతయున్=చాల, పుట్టున్=కలుగుచుండును,

తా. బొగ్గు నిప్పుయొక్క ప్రకాశము కలిగినప్పుడు వెలఁగెడి యయ్యగ్నికాంతి పోయినవెంటనే మిగుల నల్లనిదగుచున్నట్లే భాగ్యమున్నంత

పిమ్మట—తరువాత, అనంతరము, పరోక్షమందు, అని యర్థములు. ఉదా:—క, ఆరీతి నంతిపురమున। నారీతిలకము సఖీజనంబులు గొలువన్ జేరిరి పిమ్మట మదిలోఁ। గూరినపిమ్మటవిరాళిఁ గొనినరుఁడుండెన్. అని విజయవిలాసము. "అలజడి సండిలిపిమ్మట" అని యాంధ్రనామశేషము

కాలము మనుష్యుఁడు ప్రభగలిగి యుండునుగాని అది లేకుండిన మిగుల మాఱురూపముం గాంచును.

ఉ. ఏగతి బాటుపడ్డ గల ♦ దే భువి నల్పునకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖగల ♦ పుణ్యునకుంబలె భూరిసత్త్వసం
యోగమదేభకుంభయుగ♦ళోత్థితమాంసము నక్కకూనకే
లాగుఘటించుసింహము త♦లంచినఁజేకురుఁగాక భాస్కరా.

టీ. భాస్కరా! ఏగతిన్=ఏవిధమున, పాటుపడ్డన్ = శ్రమపడుచున్నను (కష్టపడుచున్నను) భువిన్=పుడమియందు(భూమిని) అల్పునకున్=నీచునకు, భాగ్యరేఖ = అదృష్టలక్షణము. (ఐశ్వర్యచిహ్నము) కల పుణ్యునకుంబలె=గలిగిన సుకృతవంతునకువలెనే, సమగ్రతా = నిండయిన భోగము=సుఖము, (సౌఖ్యము) కలదే=ఉన్నదా! (లేదనుట) కలదు + ఏ=కలదే, అని వ్యతిరేకార్థమున వచ్చిన ఏకారము. ఎట్టులన:-భూరి = ఘనమైన, సత్త్వ=బలముయొక్క (సత్తువయొక్క) సంయోగ = కలయిక గల (కూడికగల) మద + ఇభ—మదేభ=మదించిన గజముయొక్క (ఏనుఁగుయొక్క,) కుంభయుగళ=కుంభములయొక్క జంటయందు, ఉత్ + హిత—ఉత్థిత=బయలుదేరిన (పుట్టిన) మాంసము=పలలము, సింహము = సింగము, (మృగరాజు) తలంచినన్ = కోరినయెడల, చేకుఱున్ + కాక = లభించునుగాని (దొరకునుగాని) నక్కకూనకున్=నక్కపిల్లకు, ఏలాగు = ఏవిధమున (ఎట్లు), లభించును = సంప్రాప్తమగును=దొరకును, (దొరకదనుట)

తా. మదగజ కుంభస్థలములయందుండు మాంసమును సింహము గోరినయెడల సంప్రాప్తించునుగాని ఎంతకష్టపడినను నక్కపిల్లకుఁ చేకూరనివిధ

23. కుంభము—ఏనుఁగు నడినెత్తిని గల యెత్తయిన యొకభాగము, కడవ, ఒకరాశి, అని యర్థములు.



ముగా భాగ్యవంతునకు పూర్ణమైన సుఖము దొరకునుగాని యెంతశ్రమపడినను అల్పునకు దొరుకనేరదు.

ఉ. ఏడననర్థుఁ డుండు నట ♦ కేఁగు ననర్థుఁడునర్థుడున్నచో
జూడఁగనొల్లఁ డెట్లన న ♦ శుద్ధగుణస్థితి నీఁగపూయముం
గూడినపుంటిపై నిలువఁ గోరినయట్టులు నిల్వనేర్చునే
మూడిద వెట్టునెన్నుదుటి♦చొక్కపుఁగస్తురిమీఁద భాస్కరా.

టీ. భాస్కరా! అనర్థుఁడు =చెడ్డవాఁడు, ఏడనుండన్=ఎక్కడనుండునో, అనర్థుఁడున్ = చెడ్డవాఁడును, అటకున్ = అచ్చోటునకు, నేఁగును = పోవుచుండును. అర్థుఁడు=మంచివాఁడు, ఉన్నచోన్= ఉండినతావులను (ఉన్నచోట్లను) చూడఁగ నొల్లఁడు = కాంచుటకయిన సమ్మతింపఁడు, (ఎట్టులనఁగా) ఈఁగ = మక్షికము, అశుద్ధ = నిర్మలముకాని, (శుభ్రముకాని) గుణస్థితిన్=స్వభావము కలదై యుండుటచే. పూయమున్=చీమును. కూడిన పుంటిపైన్=కలయట్టి కురుపుమీఁద, (పుండుమీఁద) నిలువన్=నిలుచుటకు. కోరినయట్లు=వాంఛించినట్లు(ఇష్టపడినట్లు) మూడిద=

గుణము—ఐశ్వర్యాది; (ఐశ్వర్యము, వీర్యము, యశము. శ్రీ, జ్ఞానము, వైరాగ్యము, ఇవిభగవంతుని షడ్గుణములు,) త్యాగశౌర్యాది, త్రాడు, వడము (అనఁగా రథపుత్రాడు] అల్లెత్రాడు (అనఁగా వింటినారి) మడుఁగు (అనఁగా ఇనుమడుఁగుమొ) శబ్దాది:(శబ్దము, స్పర్శము, రూపము, గంధము ఇవి యైదు భూతగుణములు,) శుక్లాది; సంధ్యాది; (ఇవియాఱు—సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము ఆశ్రయము,) సత్త్వాది, ఇవి మూఁడు—సత్త్వము. రజస్సు, తమస్సు. వీనికి శక్తులనియు నామాంతరము కలదు.) ఇంద్రియము, అప్రధానము, అలవాటు,(కావ్యగుణములు:—(శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము ఔదార్యము, కాంతి, ఓజస్సు సమాధి అని పది)

కొన్కగా (అనఁగా విలాసార్థమనుట) పెట్టు=దిద్దుకొనిన (పూచికొనిన) నెన్నుదుటి=నుదుటనున్న. చొక్కపు=సొగసైన(అందమైన) కస్తురిమీఁదన్ =మృగమదముమీఁద, నిల్వఁగనేర్చునే = ఉండఁగలదా, [అనఁగా [వాలదనుట,]

తా. మక్షికము సువాసనతో నిండిన కస్తూరిబొట్టుమీఁద వ్రాలక దుర్వాసనతో నిండిన చీముపట్టిన పుంటిమీఁదనే వ్రాలునట్లు చెడ్డవాఁడు మంచివానియొద్దకేగ నేరక చెడ్డవానియొద్దకే పోవుచుండును.

ఉ. ఏల సమస్తవిద్యల నొకించుక భాగ్యము గల్గియుండినన్
జాలు ననేక మార్గముల♦సన్నుతికెక్క; నదెట్లొకో యనన్
రాలకు నేడ విద్యలు తి ♦ రంబుగ దేవరరూపు చేసినన్
వ్రాలినమస్కరించి ప్రస ♦ వంబులువెట్టరెమీఁద భా.

టీ. భాస్కరా ! సమస్తవిద్యలన్=ఎల్లవిద్యలతో, ఏల = ఎందుకు, (ప్రయోజనహీనమనుట) ఒకించుక = స్వల్పము, (కొంచెము) భాగ్యము= అదృష్టము, కల్గి, ఉండినన్ = ఉన్నయెడల, అనేక మార్గములన్ = పలు తెఱంగులచే (తృతీయార్థమున ద్వితీయ) సన్నుతికిన్ ఎక్కన్ = పొగడు గాంచుటకు, (పొగడ్తను జెందుటకు) చాలున్ = సమర్థుఁడగును, (సరిపడును) అది ఎట్లు ఒకో అనన్=అది యే ప్రకారమనఁగా, విద్యలు = చదువులు, రాలకున్ = శిలలకు (రాళ్ళకు) ఏడన్ = ఎందు, (విద్యలేనివని యర్థము) తిరంబుగన్ = స్థిరముగా, నిలుకడగా దేవరరూపు= దేవతావిగ్రహములుగా (రాళ్ళననుట) చేసినన్ = ఒనర్చిన యెడల, (మనుష్యులని తెచ్చిపెట్టుకొనవలెను.) వ్రాలి=క్రింద నొఱఁగి, నమస్కరించి = వందనముచేసి, దండప్రణామము చేసి, ప్రసవంబులు = పుష్పములు, (పువ్వులు పెట్టరు + ఎ=ఉంచరా (ఉంతురనుట.)

తా. శిలలు విద్యలు నేర్వకున్నను వాని భాగ్యవశమున దేవతారూపముగాంచి యెల్లరచేనమస్కరింపఁబడి పూజింపఁబడుచున్నవిమనుష్యులు

ప్రసవము = పూవు, కానుపు, పండు, పుట్టుక, బిడ్డ, అని అర్థములు



అదృష్టవంతులయినచోఁ బలుతెఱంగుల నుతింపఁబడుదురుగాని విద్యల నేర్చినందువలన గాదు.

ఉ. ఒక్కఁడెచాలునిశ్చలబ♦లోన్నతుఁడెంతటి కార్యమైనఁదాఁ
జక్కనొనర్పఁ, గౌరవుల ♦ సంఖ్యులుపట్టిన ధేనుకోటులం
జిక్కఁగనీక తత్ప్రబల ♦ సేన ననేకశిలీముఖంబులన్
మొక్కపడంగఁజేసి తుద♦ముట్టఁడెయొక్కకిరీటిభాస్కరా.

టీ. భాస్కరా ! నిశ్చల = చలనములేని, బల = శౌర్యము చేత, ఉన్నతుఁడు = గొప్పవాఁడగు,ఒక్కఁడు + ఎ=తానొక్కఁడే, ఎంతటికార్యముఐనన్=ఎంతటిఘనమగుపనియైనను. చక్కన్=లెస్సగా (బాగుగా), ఒనర్పన్ = చేయుటకు [కావించుటకు] ఎట్లనగా:—ఒక కిరీటి = ఒక్క యర్జునుఁడే, సంఖ్యులు = లెక్కలేని [చాలామందియనుట] కౌరవులు= కురువీరులు ,పట్టిన ధేనుకోటులన్=పట్టుకొనితోలుకొనిపోవుచున్న యావుల గుంపులను, చిక్కఁగన్ + ఈక=దొరకనీయక [కౌరవులకనుట]తత్ + ప్రబలసేన = వారల ఘనమగుసైన్యమును, అనేక శిలీముఖంబులన్=వివిధములగు సాయకములచే (పెక్కుబాణములచే) మొక్క పడంగన్ + చేసి=ఓడించి [జయించి]తుదముట్టఁడు + ఎ=చివరకార్యమును జూడఁగా(అనఁగాఁ దన పని నెరవేర్చుకొనెననుట)

26. అజ్ఞాతవాసమునఁ బాండవులు విరటుని సేవించుచు నుండిరనువార్త దుర్యోధనుఁ డాలించి విరటునిగోవులఁ దోలుకొనిపోనఁ బ్రయత్నించినచోఁ బాండవులు బయలుపడఁగలరనియు మొదటి నిర్ణయప్రకారము మరలఁ బదునాలుగేండ్లు వనవాసమునకుఁ బంపవచ్చుననియు నిశ్చయముచేసికొని గొప్ప సేనతో విరటుని యాలమందందనపురికిఁ దోలుచుండెను. ఆ సమయమున నర్జునుఁడు గడువుదినములు చెల్లిపోవుటఁ దెలిసికొని యొంటిగాఁజని కౌరవ సేనంబారఁదోలి పశుగణముం దోలుకొనిపోయి విరటున కొప్పఁజెప్పెను

శిలీముఖము:-బాణము, తుమ్మెద అని యర్థములు.

తా. కౌరవులు చాలమందికూడివిరటునియావులమందలనుదోలుకొని పోవుచుండఁగా అర్జునుడొక్కఁడే వారినందఱ జయించి గోగణమును మరలించుకొని యే తెంచిన విధంబున నైసర్గిక బలముగలగొప్పవాఁడెట్టిగొప్పపని నైనఁ నిర్వహింపఁ గలఁడు,

ఉ. కట్టడదప్పి తాము చెడు ♦ కార్యముఁ జేయుచునుండి రేని దోఁ, బుట్టినవారినైన విడి ♦ పోవుట కార్యము; దుర్మదాంధ్య ముం, దొట్టినరావణాసురుని ♦ తో నెడబాసి విభీషణాఖ్యుఁడా పట్టునరాముఁజేరి చిర ♦ పట్టముగట్టుకొనండె? భాస్కరా.

టీ. భాస్కరా! కట్టడ = పాడి [మర్యాద] తప్పి = వదలి, తాము = మనుజులు. చెడుకార్యము = చెడ్డపనిని, చేయుచున్ = కావించుచు, (ఒనర్చుచు) ఉండిరి + ఏని = ఉన్న యెడల, తోన్ + పుట్టినవారిన్ + ఐనన్ = తనయనుజన్ముఁడైనను (సోదరునినైనను) విడి = వదలి, పోవుట = వెళ్ళుట, (చనుట) కార్యము = తగినపని. దుర్మద + అంధ్యమున్ = చెడ్డమత్తతవలన సంభవించినగ్రుడ్డితనమును, తొట్టిన = చెందినట్టి (పొందిన) రావణ + అసురుని తోన్ = రావణుఁడను రాక్షసునితో. ఎడన్ + పాసి = ఎడబాసి = తొలగి (దూరమయి) విభీషణ + ఆఖ్యుఁడు = విభీషణుఁడను పేరుగలవాఁడు, ఆపట్టునన్ = ఆసమయమందు, రామున్ = శ్రీరాముని, చేరి = సమీపించి, (శరణుజొచ్చి) చిరపట్టము = శాశ్వతలంకా రాజ్యాధిపత్యము, కట్టుకొనండు + ఎ = కట్టుకొనలేదా? (కట్టుకొనెననుట)

---

27. విభీషణుఁడు = విశ్రవస్సునకుఁ గైకసియందుఁ బుట్టిన మూఁడవ కుమారుఁడు, రావణాసురుని యనుఁజుఁడు. ఇతఁడు శ్రీరామునకు సీతాదేవిని మరల గొనిపోయి యిమ్మని తన యన్నయగు రావణునకు బహువిధముల బోధించిన యది యతఁడు, వినక, అవమానించినందున నతనిని వదలి రాముని శరణుజొచ్చెను. అంతట శ్రీరాముఁడు ఇతని కభయమిచ్చి రావణుని మరణానంతరము లంకకు రాజునుగాఁజేసెను. ఇతఁడు చిరంజీవి.



తా. మదాంధుఁడైరావణాసురుఁడు చెడుపనినిచేయుటచే విభీషణుడు అన్నను వదలిపెట్టి రామునకు హితుఁడై లంకకధిపతియైనట్లే పాడుపనులు చేసినచో దనసోదరుఁడైనను విడిచిపోయిన తప్పక లాభము కలుగును.

ఉ. కట్టడయైనయట్టి నిజ ♦ కర్మము చుట్టుచువచ్చి యేగతిం బెట్టునొ పెట్టినట్లనుభ ♦ వింపకతీరదు కాళ్ళుమీఁదుగాఁ గిట్టక వ్రేలుడంచుఁ దల ♦ క్రిందుగఁగట్టిరెయెవ్వరైన నా చెట్టున గబ్బిలంబులకుఁ ♦ జేరినకర్మము గాక భాస్కరా.

టీ. భాస్కరా! కట్టడ = విద్యుక్తము, (పూర్వులచే నొనర్పఁబడినదనుట) ఐన అట్టి నిజకర్మము = అయిన పురాకృతకర్మము, చుట్టుచున్ = (తన్ను) ఆవరించుచు, వచ్చి = ఏతెంచి, ఏగతిన్ పెట్టును + ఒ = ఎట్టికష్టముల గలుగఁజేయునో, పెట్టిన + అట్లు = ఆది కలిగించిన విధముగా, అనుభవింపక తీరదు = భుజింపకమానదు, (పొందకతీరదనుట) ఎట్టులన = ఆచెట్టునన్ గబ్బిలంబులకున్ = ఆవృక్షమున వ్రేలాడుచున్న తైలపాయికలకు (అనగా దలక్రిందుల పక్షులనుట) చేరినకర్మము కాక = కాంచినపూర్వకర్మము తప్ప, యెవ్వరు + ఐనన్ = ఏమానవులైనను, కిట్టక = సహింపక, కాళ్ళు మీఁదుగాన్ = పాదములుపయిగాను, తలక్రిందుగాన్ = శిరస్సుక్రిందుగాను వ్రేలుఁడు = వ్రేలాడుచుండుఁడు, అంచున్ = అని పల్కుచు, కట్టిరె = బంధించినారా! (కట్టలేదనుట.)

తా. తలక్రింపక్షులు ఇతరులు తమ్ము తలక్రిందుగా చెట్టునకు వ్రేలాడఁగట్టకున్నను తమపూర్వజన్మ కర్మముచే నావిధముగా వ్రేలుచున్నట్లే దైవవశమున మానవుఁడట్లు నడువక తప్పదు,

ఉ. కట్టడలేనికాలమునఁ ♦ గాదు శుభంబారు లెంతవారు చే పట్టిననైన మర్త్యునకు భాగ్యము రాదనుటెల్లగల్ల కా దెట్టని పల్కినన్ దశర ♦ థేశవసిష్ఠులు రామమూర్తికిన్ బట్టముకట్టఁగోరి రది ♦ పాయక చేకుఱెనొటు భాస్కరా.

టీ. భాస్కరా! మర్త్యునకున్=మానవునకు, కట్టడ = దైవనిర్మితమైనయేర్పాటు, లేనికాలమునన్=లేనట్టివేళయందు, శుభంబు = జయము, (మంగళము) కాదు=కలుగనేరదు ఒరులు = ఇతరులు, (అన్యులు) ఎంతవారు=ఎంతటిఘనులు (ఎంతటిగొప్పవారు) చేపట్టినన్ + ఐనన్=దరిఁజేర్చినను, భాగ్యము=సంపత్తు, రాదు=సంభవింపదు, (కలుగదు), అనుట + ఎల్లన్=అనుటయంతయు (అనుటసర్వము) కల్లగాదు=అసత్యముకాదు (అబద్ధముకాదు) ఎట్లు + అని=ఏవిధముగానని, పల్కినన్=వచించినచో (అడిగినచో) దశరథేశవసిష్ఠులు=దశరథుడును, వసిష్ఠమహామునియు, రామమూర్తికిన్ = శ్రీరామచంద్రునకు, పట్టముకట్టన్=పట్టాభిషేకము చేయుటకు, కోరిరి = ఆసపడిరి, (ఎంచిరి) అది=ఆపట్టాభిషేకము, పాయక=చెడక, (విఘ్నముకాక) చేకుఱెన్ + ఓటు=అయినదా? (జరిగినదా? అనఁగాజరుగలేదనుట)

తా. దశరథమహారాజును, వసిష్ఠమహర్షియు శ్రీరామునకుఁ బట్టాభిషేకము జేయ నెంత యత్నపడినను జరుగనట్లే మానవునకు అదృష్టకాలము ప్రాప్తముకాకుండ జయము కలుగదు. ఎంతభాగ్యవంతుఁడు పట్టుపట్టినను సంపదలురావు.

ఉ. కానక చేరఁ బోల దతి ♦ కర్ముఁడు నమ్మిక లెన్ని చేసినం
దానది నమ్మి వానికడ ♦ దాయఁగఁ బోయిన హానివచ్చు; న

29. దశరథుఁడు = అజమహారాజు కొడుకు. పూర్వము దేవాసురయుద్ధమునందు దేవతలకు సహాయము చేయఁబోయి శంబరాసురుఁడను వానితో యుద్ధముజేయునపుడు ఆయసురుఁడనేకమాయలు కావింపఁగాఁ గైకేయి తాను ధవళాంగుఁడను మునివలనఁ బడసిన మంత్రవిద్యచేత నామాయలనెల్ల నణఁచివేయనందులకు దశరథుఁడు మెచ్చుకొని నీకు ఏమి వరము కావలెనని యడుగ రెండువరములడిగి యవి తనకుఁ గావలసినప్పుడు ఇచ్చునట్లొప్పించుకొని యుండెను గనుక ఆ వరము లిప్పుడిమ్మని రామునిపట్టాభిషేక



చ్చోనదియెట్లనం గొఱఁకు ♦ చూపుచు నొడ్డినబోను మేలుగా
బోనని కాన కాసపడి ♦ పోవుచుఁగూలదె కొక్కు భాస్కరా.

టీ. భాస్కరా! అతికర్ముఁడు = చెడుపనులు చేయువాఁడు(పాపి) ఎన్ని నమ్మికలు=చాల విశ్వాసములు, చేసినన్=గావించినను, (చూపినను) కానక=కనుఁగొనక (యోజనసేయక) చేరన్ + పోలదు=సమీపింపరాదు, (దగ్గఱిల్లరాదు) తాన్ = తాను, (మనుష్యుఁడు) అది, నమ్మి = విశ్వసించి, వానికడన్ = ఆపాపాత్మునున్నతావున, డాయఁగన్ = డాయునట్లు (చేరునట్లు) పోయినన్=వెళ్ళినచో, అచ్చోన్=అప్రదేశమందు, హాని=కీడు (అపాయము) వచ్చున్ = కలుగును, అది ఎట్లనన్ = అది యేలాగు ననఁగా; కొక్కు = పందికొక్కు, (ఎలుక) కొఱకు=ఎఱను. (మేతను) చూపుచున్=కనఁబఱచుచు, మేలుగాన్=చక్కఁగా, ఒడ్డిన = పన్నియుంచిన, బోనును=జంతువులనుబట్టు నొక విధమైన యంత్రమును, బోను అని=

సమయమున రాముని వనవాసమునకుఁ బంపునట్లును భరతునకుఁ బట్టముగట్టను గోరఁగా, దశరథుఁడేమియుఁ జెప్పనోడియూరకుండెను. కైకేయి రామునితో నిన్ను మీతండ్రి వనవాసముచేయుటకుఁ బొమ్మనెను. అనిచెప్పనతడట్లేచేసెను. అదివిని దశరథుఁడు మృతినొందెను. ఆ దశరథమహారాజు పూర్వము వేటాడఁబోయి యొక ఋషిపుత్రుఁడు అంధులగు దలిదండ్రులకొఱకుఁ గమండలముతోఁ దటాకమున జలము ముంచుచుండఁగా, ఆనీళ్లు ముంచెడు చప్పుడువిని ఏనుఁగుతొండముతో నీళ్లుత్రాగుచున్నదని బాణమును సంధించివైచెను. ఆయేటు తగిలినతోడనే ఆఋషిసుతుఁడు మృతినొందెను. పిదప రాజు తనతప్పిదమును దెలిసికొని యచటికిపోయి యతని నూరడించి తాను తెలియక యిట్టిపనిచేసితినని ఆదంపతులకుఁ జెప్పెను. వారు పుత్రశోకమునుభరింపలేక నీవును మావలె పుత్రశోకముచే మృతినొందుదువుగాకయని శపించి, ప్రాణములను విడిచిరి. వసిష్టుడు:—బ్రహ్మమానసపుత్రులలో నొకఁడు. మహాతపస్సంపన్నుఁడు. ఇక్ష్వాకువంశజులకుఁ బురోహితుఁడు, వైవ

తన్నుజంపఁబట్టెడియొకయంత్రమని, కానక = తెలిసికొనక (తలంపక) ఆసపడి = కోరికఁజెంది, (అపేక్షనొంది) పోవుచున్ = వెళ్ళుచు. (అందుదూరుచునటు) కూలఁడే = మృతినొందఁడా (చచ్చుననుట).

తా. తనకుఁ దిండినిజూపుచు నొడ్డినబోనును బోననియెఱుంగక పందికొక్కు ఆసించిపోయి యందుఁజిక్కుకొని చచ్చునట్లుగా నెన్నిచమత్కారములుచేసినను పాపాత్మునిచెంతకుఁబోఁగూడదు. బోయినదప్పక ముప్పగలుగును.

ఉ. కానిప్రయోజనంబు సమ ♦ కట్టదు తాభువి నెంతవిద్యవాఁ
డైననుఁ దొడ్డరాజుకొడు ♦ కైనన దెట్లు? మహేశుపట్టి వి
ద్యానిధిసర్వవిద్యలకుఁ ♦ దానె గురుండు వినాయకుండు దాఁ
నేనుఁగురీతినుండియు న ♦ దేమిటికాఁడఁడు పెండ్లి? భాస్కరా.

టీ. భాస్కరా! భువిన్ = పుడమియందు (ధరణిలో) తాన్ = తాను, ఎంతవిద్యవాఁడు + ఐనను = ఎంతటిచదువుగలవాఁడైనను, దొడ్డరాజుకొడుకు = పెద్దప్రభువుయొక్క పుత్రుఁడు, ఐనన్ = అయినను, కాని ప్రయోజనంబు = అనుకూలపడనిపని, సమకట్టదు = కాదు, అది + ఎట్లు = అది ఎట్లనఁగా, మహేశుపట్టి = శివునికొడుకు, విద్యానిధి = చదువులకు (విద్యలకు) ఉనికి

---

స్వతమన్వంతరమున సప్తఋషులలో నొకఁడు. ఇతని భార్య యరుంధతి. కొడుకులు శక్తి మొదలగువారు నూఱుగురు. ఈతఁడు దక్షప్రజాపతికూఁతురగు ఊర్జను బెండ్లియాడి యాపెయందు రజుఁడు, గోత్రుఁడు, ఊర్ధ్వబాహువు, సవనుఁడు, అనఘుఁడు, సుతపుఁడు, శుక్రుఁడు, అని యేడుగురు పుత్రులనుబడసెను. వారు స్వాయంభువమన్వంతరమున సప్తఋషులుగనుండిరి. ఇతఁడు తొలుత బ్రహ్మమానసపుత్రుఁడు అయియుండిన నిమిశాపముచేత అశరీరమునకు నాశనముకలుగఁగా మిత్రావరుణులకు మరల జన్మించెను. ఒకప్పుడుమిత్రావరుణులకు ఊర్వశినిచూచి రేతస్స్ఖలితమయి అదియొక కుంభమునందుఁ జేర్పఁబడగా నందుండి వసిష్ఠుఁడును అగస్త్యుఁడునుబుట్టిరి. కనుక వీరిద్దరును కుంభసంభవులనఁబడుదురు.



పట్టు, సర్వవిద్యలకున్ = ఎల్లచదువులకు, తానె = తానొక్కఁడె, గురుండు = ఒజ్జ (ఉపదేశకుఁడు) వినాయకుండు = (అయిన) గణపతి, తాన్ = తాను, ఏనుఁగురీతిన్ = గజముంబోలె. ఉండియున్ = ఉన్నప్పటికిని; (అనఁగా గజముఖుఁడనుటయు, సత్త్వముకలవాఁడనియు భావము) పెండ్లి = వివాహము. ఏమిటికిన్ = ఏకారణమున, ఆడఁడు = చేసికొనఁడు ! చేసికొనలేదనుట

తా. శివునకు పుత్రుఁడును, సర్వవిద్యలకునికిపట్టును, ఎల్లరకిగురువును ఏనుగంతబలమున్నవాఁడునై యుండియు వినాయకుఁడు పెండ్లిగాకుండనున్నట్లే మనుష్యుఁడు తానెంత పండితుఁడైనను రాజాధిరాజకుమారుఁడైనను దైవము తన్నుఁగాఁజూడనిచోఁ గార్యమును నెఱవేర్చుకొనఁ జాలఁడు.

ఉ. కామితవస్తుసంపదలు ♦ గల్గుఫలంబొరు లాసపడ్డచో
నేమియుఁ బెట్టఁడేని సిరి ♦ యేటికి? నిష్ఫలమున్నఁబోయినన్
బ్రామికపడ్డలోకులకుఁ ♦ బండఁగ నేమది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేఁదువిడ ♦ దెన్నటికైన ముసిండి భాస్కరా.

టీ. భాస్కరా! ఒరులు = అన్యులు (ఇతరులు) కామితవస్తుసంపదలు = కాంక్షించిన (కోరిన) పదార్థములయొక్క సంపత్తులు, కల్గుఫలంబు = ప్రాప్తించియుండుటచేఁకలిగిన లాభమును, ఆసపడ్డచోన్ = కోరినప్పుడు, ఏమియున్ = ఎంతమాత్రమును (ఇంచుకయు) పెట్టఁడేని = (భాగ్యవంతుఁడు) ఈయకపోయినయెడల, సిరి = (వానియొక్క) లక్ష్మి (సంపద) ఏటికిన్ = ఏల (ఎందుకు] ఉన్నన్ = ఉన్నప్పటికిని, పోయినన్ = నాశనమైనప్పటికిని, నిష్ఫలము = లాభములేనిది (వ్యర్థము) ముసిండి = ముషిచెట్టు. ఎన్నటికయినన్ = ఎప్పటికైనను (ఎన్నిదినములకైనను) చేదు = విషమును, విడదు = వదలదు, అది = అట్టిముసిడిచెట్టు, పండఁగన్ + ఏమి = పండినసమయమందయినను, (ఫలించినప్పుడయినను, ఎండిపోవఁగాన్ = ఎండిపోయినప్పుడయినను (చచ్చినను) బ్రామికపడ్డలోకులకున్ = ఆసపడియున్న జనములకు, ఏమిఫలంబు = ఏమియును ఫలములేదు.

తా. ఎప్పుడును ముసిండిచెట్టు చేదుగా వదలకుండునప్పుడా చెట్టు పండిన నెండిన నాశచే నాచెట్టును గనిపెట్టుకొనియున్న మనుజులకేమియు లాభములేనట్లే భాగ్యవంతుఁడు తన్నాశ్రయించి యున్న మనుజుల కెంత మాత్రము బెట్టనికాలమందు వానిసంపదయున్నను లేకున్నను నొకటియే.

ఉ. కారణమైనకర్మములు ♦ కాక దిగం బడవెన్నిగొందులం
దూఱిన నెంతవారలకు ♦ దొల్లిపరీక్షితు శాపభీతుఁడై
వారిధి నొప్పునుప్పరిగ ♦ పైఁ బదిలంబుగ డాఁగి యుండినం
గ్రూరభుజంగదంతహతిఁ ♦ గూలఁడెలోకు లెఱుంగ భాస్కరా

టీ. భాస్కరా! ఎన్నిగొందులన్ = ఎన్నిమూలలలో, దూఱినన్ = డాగియుండినను, ఎంతవారలకున్ = ఎట్టిఘనులకును (ఎట్టిగొప్పవారికిని) కారణము = నిమిత్తము (హేతువు] ఐనకర్మముల్ = అయినట్టికర్మములు, కాక = కాకుండ, (అనుభవమునకు రాక) దిగంబడవు = నిలిచిపోవు [నశింపవు) ఎట్లనఁగా, తొల్లి = పూర్వకాలమున, పరీక్షితు = పరీక్షిన్మహారాజు శాపభీతుఁడై = [మునియొక్క] శాపమువలన భయము నొందినవాఁడై, వారిధిన్ = సముద్రమందు (కడలిలో) ఒప్పు = ప్రకాశించుచున్, ఉప్పరిగపైన్ = సౌధముమీఁద (మేడపైని) పదిలంబుగన్ = సుఖముగా

33. పరీక్షిత్తు = ఇతనితండ్రి అభిమన్యుఁడు, తల్లి యుత్తర, తాత అర్జునుఁడు. ఇతఁడు పాండవుల తరువాత కురుదేశముల బాలించినవాఁడు. ఈతఁడొక నాఁడరణ్యమునకు వేటకుఁబోయి వచ్చునప్పుడు దారిలోనొక ముని తపస్సులోనుండఁగా నచటఁజచ్చి యున్న పాము నా ముని మెడకుం దగిలించెను. తరువాత నా ముని కుమారుఁడదివిని ఈదుర్మార్గకార్య మొనరించినవాఁడు నేటికి యేడుదినములలో సర్పదష్టుడై చచ్చుగాక యని శపింపదానికి పరీక్షిత్తు భయపడి సముద్రమధ్యమున నొక మేడ నిర్మించుకొని యుండఁగా నొక బ్రాహ్మణుఁడిచ్చిన ఫలమును వాసనచూడ నందుండి యొక పాము బయలు దేరి యాతనిం గఱచి చంపెను.



(భద్రముగా) డాఁగియుండినన్ = దాఁగుకొనియున్నను, క్రూర = కఠినమైన (భయంకరమైన) భుజంగ = పన్నగముయొక్క (పాముయొక్క] దంత = కోఱలయొక్క, హతిన్ = దెబ్బచేత (కఱపుచేత) లోకులు = ప్రజలు (జనులు) ఎఱుంగన్ = తెలిసికొనునట్టుగా, కూలఁడు + ఎ = మృతి నొందఁడా (చావఁడా) చచ్చెనుట.

తా. ముని యిడిన శాపభీతిచే పరీక్షితు నడిసముద్రములో మేడను నిర్మించుకొనియున్నను బాముచే మరణము జెందవలసినవాఁడైనట్లే యెంత గొప్పవారైనను, ఎందుఁదాగియున్నను దామనుభవింపవలసిన కర్మమనుభవింపక తీరదు.

చ. కులమున నక్కడక్కడన ♦ కుంఠితధార్మికుఁ డొక్కఁడొక్కఁడే
కలిగెడుఁగాక పెద్దఱుచు ♦ గల్గఁగ నేరరు, చెట్టు చెట్టునన్
గలుగఁగనేర్చునే గొడుగు ♦ కాములు సూడఁగ నాడనాడనిం
పలరఁగ నొక్కొటొక్కటి స ♦ యంబునఁ జేకుఱుఁ గాక
భాస్కరా.

టీ. భాస్కరా! అకుంఠితధార్మికుఁడు = చలనములేని ధర్మబుద్ధిగలవాఁడు, కులమునన్ = వంశమందు (వంగడమున) అక్కడక్కడన్ = ఒక్కొక్కతావునందు, ఒక్కఁడొక్కఁడే, కలిగెడుఁగాక = ఉండును గాని, (సంభవించును గాని) పెద్దఱుచు = మిగుల నెక్కువగా,

34. నయమునకు నియమార్థ మెందుచుగాన రాదు. ఏమారుమూలనయిననున్నను ఇక్కడ నాయర్థమునకన్న నిన్న నియమునర్థమునే చెప్పుకొనుట మంచిది. ఈపద్యమున గొడుగుకాములు. అన్నిచెట్లను తిన్నగానున్నవి లభింపవు. ఎక్కడనో యొకచెట్టున మాత్రమే యుండునని కవియభిప్రాయము. నయము = నీతియనునర్థమున నియమమును జెప్పుకొనినను అంత సరసముకాదు, నయము, లాభము. ననవు, మృదుత్వము, అందము. చౌక నునుపైనది, మేలైనది, అని యర్థములు.

కల్గఁగ నేరదు = సంభవింపఁజాలదు. చూడఁగన్ = ఎంచఁగా. గొడుగు కొమలు = గొడుగుకజ్జలు, అడవినాడన్ = అందము, ఇంపు, + అలరన్ = ఒప్పెడునట్లు. నయమునన్ = సొంపుతోఁగూడి, ఆవగాఁ దిన్ననివనట ఒక్కటొక్కటి = ఒక్కటియే. చేకుఱున్ + కాక = దొరకును గాని. చెట్టుచెట్టునన్ = అన్నిచెట్లయందును కలుగఁగ నేర్చున్ + ఎ = కలుగునా (ఉండునా!) ఉండదనుట.

తా. గొడుగునకుఁ గామగాననమర్చుకొనఁదగిన కజ్జలు తిన్ననివి యెక్కడనో యొక్క చెట్టున నొక కొన్ని యుండును గాని ప్రతివృక్షమున నన్నియు వంకలేనివి దొరకనట్లే మంచి ధర్మాత్ములు ఎక్కడనో యొకొక్క వంశమందొక్కరుడే పుట్టుచుండును గాని యెక్కువగా నుండరు.

ఉ. క్రూరమనస్కులౌ పతులఁ ♦ గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడు ♦ వర్తన వాటిలు, మాధురీజలో
దారలు గౌతమీముఖ మ♦హానదు లంబుధిఁ గూడినంతనే
క్షారముఁ జెందవే మొదలి♦కట్టడలన్నియుఁ దప్పి భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరమనస్కులు = కఠినచిత్తులు. ఔపతులన్ = అయినట్టిరాజులను, (ప్రభువులను) కొల్చి = సేవించు, వసించిన మంచి వారికిన్ = ఉండినట్టియోగ్యులగు మనుజులకు, వారిగుణంబె = ఆప్రభువుల స్వభావమే, పట్టి = పూని, చెడువర్తన = పాడునడవడి, పాటిలున్ = కలుగును, ఎట్లనఁగా:...మాధురీ = రుచ్యముతోఁగూడిన [తియ్యదనముతోఁగూడిన] జల = ఉదకముచేత [నీటిచేత) ఉదారలు = ఘనమైనవగు, గౌతమీ = గోదావరి, ముఖ = మున్నుగాఁగల, మహానదులు (పెద్దనదులు) అంబుధిన్ = సాగరమును (సముద్రమును) కూడినంతనే = చేరినంతనే (కలిసినంతమాత్రముచేతనే) మొదలికట్టడలు + అన్నియున్ = పూర్వమున్న రుచి మొదలగు స్వభావములన్నియు, తప్పి = పోయి (విడచిపెట్టి) క్షారమున్ = చేదును, చెందవు + ఏ = పొందవే! (పొందుననుట)



తా. మధురములగు నుదకముతో నొప్పుచున్న మహానదులన్నియు సాగరమునఁ బడినంతలోనే మొదటఁగల రుచినివీడి యుప్పఁదనమును వహించునట్లు కఠినుఁడగు ప్రభువును సేవించుచు నుత్తములుగూడఁ దమ సద్గుణములను విడిచి వాని గుణములను బూని దుర్మార్గవర్తనులగుదురు.

ఉ. గిట్టుట కేడఁ గట్టడ లి♦ఖించిన వచ్చుటఁ గాని యొండుచో
బుట్టదు చావు; జానువుల ♦ పున్కలనూడిచి కాశిఁ జావఁ
గా, ల్గట్టిన శూద్రకున్ భ్రమలఁ ♦ గప్పుచుఁ దద్విధి గుఱ్ఱ
మౌచు నా, పట్టునఁ గొంచు ♦ మఱ్ఱికడఁ ♦ బ్రాణముదీసె
గదయ్య భాస్కరా. 33

టీ. భాస్కరా, గిట్టుటకున్ = మృతినొందుటకు.(చచ్చుటకు) ఏడన్ = ఎక్కడ, కట్టడ = ఏర్పాటు, లిఖించినన్ = [విధి] వ్రాసినయెడల, అచ్చటన్ + కాని = అక్కడనేకాని, ఒండుచోన్ = వేఱొకతావునందు, చావు = మృతి (మరణము) పుట్టదు = సంభవింపదు కలుగదు] ఏట్లనఁగా:- కాశిన్ = కాశీపురమునందు. చావన్ = మృతినొందుటకు [చచ్చుటకు) జానువుల = మోకాళ్ళయొక్క, పున్కలన్ = చిప్పలను, ఊడిచి = తొలగించి (ఊడ) గొట్టుకొని కాల్గట్టిన శూద్రకున్ = (నిశ్చయముచేసికొనికదలకుండఁ గూర్చుండిన శూద్రకుఁడన్ మహారాజు, భ్రమలన్ = మాయలచే, కప్పుచున్ = చుట్టుచు, తత్ + విధి = ఆదైవము, గుఱ్ఱము + ఔచున్ = ఒక యశ్వరూపమును ధరించి, ఆపట్టునన్ = (మరణకాలము) ఆసన్నమగునప్పటికి (చేరునప్పటికి) కొంచున్ = పైనెక్కించికొనిపోవుచు, మఱ్ఱికడన్ = (ఒకానొక) వట వృక్షముదగ్గర, ప్రాణమున్ = అసువును(జీవమును) తీసెన్ + కద + అయ్య = పోఁగొట్టెనుగదా!

తా. కాశీక్షేత్రమున మృతినొందనిశ్చయించుకొని శూద్రకుఁడనుమహారాజు దన మోకాలిచిప్పల నూడఁదీసికొనియచ్చటఁ గదలక యుండఁగా నా కాశీపురాధీశ్వరుఁడొక గుఱ్ఱమునుగొని యది యెవ్వరిని యెక్కనీయక బాధించు సమయమున నీశూద్రక మహారాజు నన్నుదానిపైనెక్కించిన నేను

సవారిసేయుదునన నట్లుచేసిరి. అంత నాగుఱ్ఱము వానిని వీపుననిడుకొనిపోయి యొకచోనున్న యొకవుఱ్ఱిచెట్టునకుఁ బెట్టికొట్టఁగా మృతినొందినట్లు, ఎచ్చట జచ్చుటకై విధి నుదుట వ్రాయునో యందే చచ్చుంగాని వేఱొకతావున మృతినొందఁడు.

ఉ. ఘనబలసత్త్వమచ్చుపడఁ ♦ గల్గినవానికి హాని లేనిచోఁ
దనదగుసత్త్వమే చెఱుచుఁ♦దన్నుఁ; నదెట్లనఁ? నీరులావుగాఁ
గను వసియించినన్ జెఱువు♦కట్టకు సత్త్వము చాలకున్నచోఁ
గనుమలు పెట్టినట్టనడి♦గండి తెగంబడకున్నె భాస్కరా. 37

టీ. భాస్కరా, ఘనబలసత్త్వము = ఎక్కువ బలముతోఁ గూడిన సత్తువ, కల్గినవానికిన్ = వున్న మనుష్యునకు, హాని = కీడు (అపాయము) లేనిచోన్ = (పరులవలన) లేకున్నను, తనది = స్వకీయమైనది. (తన సంబంధమైనది.) అగుసత్త్వము = అయినబలమే, తన్నున్ = తన్ను, చెఱుచున్ = పాడుచేయును. అది + ఎట్లు + అనన్ = అది యెట్లనఁగా, నీరు = జలము (వుదకము) లావుకాన్ + కన్ = ఎక్కువకాఁగా, వసించినన్ = నిలిచినప్పుడు (వున్నపుడు) చెఱువుకట్టకున్ = తటాకపుగట్టునకు, సత్త్వము = బలము (గట్టితనము) చాలకున్నచోన్ = సరిపడకపోయినచోఁ కనుమలు = సందులు, (నెరలు) పెట్టి = పడి, నట్టనడిగండి = ఆ తటాకపుగట్టుమధ్యకన్నము, తెగంబడక = తెగక, ఉన్నె = ఉండునా ? (వుండదనుట)

తా. తటాకమునందు నీ రెక్కువగానున్నప్పుడు తటాకపుగట్టునకు బలము లేకున్న మధ్యగండిపడిపోవునట్లే తనకధికబలమున్నప్పుడు ఇతరులచేఁగీడు సంభవింపకున్నను దనసత్తువయే తన్ను బాడుసేయును.

చ. ఘనుఁడగునట్టివాఁడు నిజ♦కార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవునిఁ♦బ్రార్థనచేయుట తప్పుగాదుగా,
యనఘతఁగృష్ణజన్మమున♦నావసుదేవుఁడు మీఁదయెత్తుఁగా
గనుఁగొనిగానివానికడ♦కాళ్ళకు మ్రొక్కఁడెనాఁడు భాస్కరా.



టీ. భాస్కరా ! ఘనుఁడు = అధికుఁడు (గొప్పవాఁడు,) అగునట్టివాఁడు = అయిననరుఁడు, నిజ = తనయొక్క, కార్య = పనిని, సముద్ధరణ + అర్థము = చేసికొనుటకై (నిర్వహించుకొనుటకై) మహిన్ = పుడమిని (భూమియందు) పనివడి = ప్రయత్నించి, అల్పమానవున్ = నీచుఁడగు మనుష్యుని. ప్రార్థనచేయుట = వేఁడుకొనుట, తప్పుకాదుకా = దోషము (నేరము) కాదుగదా ! ఎట్టులనఁగా:—కృష్ణజన్మమునన్ = కృష్ణుఁడు పుట్టినపుడు. (కృష్ణావతారసందర్భమున) అనఘతన్ = పాపహీనతచేత, ఆవసుదేవుఁడు = (శ్రీకృష్ణునిజనకుఁడగు వసుదేవుఁడు) మీఁదయెత్తుగాన్ = పయియెత్తుగా (ముందుజరుపవలసిన దానిపన్నుగడగా) కనుఁగొని = చూచి, (తలఁచి) నాఁడు = పూర్వము (వెనుక) గానివానికడకాళ్ళకున్ = ఆవు గుఱ్ఱముయొక్క (గాడిదయొక్క) కడకాళ్ళకున్ = వెనుకపాదములకు, మ్రొక్కఁడు + ఎ = నమస్కరింపలేదా ! (నమస్కరించెననుట.)

తా. కృష్ణుఁడు జన్మించఁగానే యతనిని గంసునివలనబాధలేకుండఁ జేయ వ్రేపల్లెకు దీసికొనిపోవ నెంచి కావలివారికిం దెలియకుండఁ బోవుచుఁ

---

వసుదేవుఁడు = ఆనకదుందుభి, శూరునికొడుకు, దేవకిమగడు, కృష్ణబలరాములతండ్రి. కొందఱు కశ్యపుఁడు వసుదేవుఁడుగాను, అదితి దేవకిగాను పుట్టిరని చెప్పెదరు. తనచెల్లెలగు దేవకీదేవి గర్భమునఁబుట్టినవాఁడు తన్ను చంపునను నాకాశవాణివిని దేవకీవసుదేవులనుఁ జెఱసాలలో నుంచి వారికి సంతానము గలిగినపుడెల్ల వెంటనే తెలిసికొని యాసంతానమును జంపఁ దలంపుగొని ఆసంగతిని తెలుపుటకై యొక రాక్షసుని గాడిదవేషముతో నందుఁ గాపుండునట్లును. పిల్లవాఁడు పుట్టినతోడనే యార్చునట్లును నియమించెను. అట్లు గాడిదవేషముతోనున్న రాక్షసుఁడు కృష్ణుఁడు బుట్టినప్పుడు వసుదేవుఁడు కృష్ణునెత్తుకొని నందవ్రజమునకుఁబోవు సమయమున గాడిదభగవన్మాయచే నారువలేక యూరకుండఁగాఁ గంసుఁడు చూచి యార్చునేమో యని దానికాళ్లు అరువవలదని పట్టుకొనెనని పుక్కిటి పురాణము.

దానొనరించుపని కంతరాయము గలుగకుండుటకయి గాడిదకాళ్ళకు వసుదేవుఁడు మ్రొక్కినట్లే ప్రపంచమున మనుష్యుఁడు తన పని నెరవేర్చుకొనుట కొక యల్పుని బ్రార్థించినను దానివలన దోషములేదు.

చ. ఘనుఁడొకవేళఁ గీడ్పడినఁ♦ గ్రమ్మఱ నాతని లేమి వాపఁగా
గనుఁగొననొక్కసత్ప్రభువు♦ గాక నరాధములోపరెందఱుం
బెనుఁజెఱు వెండినట్టితరి ♦ బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁ దుషారముల్ శతశ ♦ తంబులు చాలునటయ్య
భాస్కరా. 39

టీ. భాస్కరా! ఒకవేళన్ = ఒకప్పుడు, ఘనుఁడు = గొప్పవాఁడు (అధికుఁడు) కీడ్పడినన్ = కీడుజెందినయెడల (దరిద్రుడైనచో) క్రమ్మఱన్ = మరల (తిరిగి) ఆతని లేమి = అతనిదరిద్రము (పేదఱికము) వాపఁగాన్ = తీసివేయుటకు (పోఁజేయుటకు) ఒక్క సత్ప్రభువుగాక = ఒక గొప్ప మంచి రాజుగాక (అనఁగా మహారాజను ట) నర + అధములు = తుచ్ఛులయిన మనుష్యులు, ఎందఱున్ = ఎంతమందియైనను, (చాలమంది కూడినను) ఓపరు = సమర్థులు కారు (తగరు) ఎట్లనఁగా:- పెను చెఱువు = గొప్ప తటాకము (పెద్దచెఱువు) ఎండిన + అట్టితఱిన్ = శుష్కించిన సమయమున (పట్టినప్పుడు) బెల్లునన్ = వెంటనే, నీటితో = జలముచేత (వుదకముచే) తనుపన్ = తృప్తి నందించుటకు (నిండించుటకు) మేఘుఁడు గాక = జలధరము గాక, (మబ్బయినచోఁదగునుగాని) తుషారముల్ = మంచుబిందువులు, శతశతంబులు = వేయియైనను. చాలునటయ్య = సమర్థములగునా (కావనుట)

తా. గొప్పతటాకము ఎండిపోయినసమయమున మరల నిండింపఁదలచినమబ్బేతగునుగాని మంచుకణము లెన్నైనను జాలనట్లే ఘనునకు బేదఱికము తటస్థించినచో దానిని నివారింప నొక మహారాజుతగునుగాని యల్పమానవులు వేయిమందయినఁ జేయసమర్థులుగారు.

---

ఘనుఁడు = గొప్పవాఁడు, మేఘుఁడు అని యర్థములు.



ఉ. చంద్రకళావతంసుకృప♦చాలనినాఁడు మహాత్ముఁడైనఁదా
సాంద్రవిభూతిఁ బాసియొక♦జాతివిహీనునిఁగొల్చియుంట యో
గీంద్రనుతాంఘ్రిపద్మ మతి♦హీనతనొందుట కాదుగా హరి
శ్చంద్రుఁడు వీరబాహుని సి♦జంబుగఁ గొల్వఁడె నాఁడు భా. 40

టీ. యోగీంద్ర = మునివర్యులచేత. నుత = పొగడఁబడు, అంఘ్రిపద్మ = చరణాంబుజములు (పాదపద్మములు) కలవాఁడా, భాస్కరా! మహాత్ముఁడు + ఐనన్ = (మనుజుఁడు) ఘనుఁడయినను (గొప్పవాఁడయినను) చంద్రకళా + అవతంసుకృప = శశిరేఖ శిరోభూషణముగాఁ గల శివుని యొక్క దయ, చాలనినాఁడు = లేనినాఁడు (సరిగానియప్పుడు) తాన్ = ఆ మనుష్యుఁడు, సాంద్రవిభూతిన్ = గొప్పయైశ్వర్యమును (ఘనసంపదను) పాసి = వదలి (విడిచి) ఒక జాతివిహీనునిన్ = ఒక కులభ్రష్టుని (నీచవంశమువానిని) గొల్చి ఉండుట = సేవించియుండుట, మతివిహీనత = బుద్ధిలేమి, (తెలివితక్కువ) కాదుగా = కాదుగదా, నాఁడు = పూర్వము, హరిశ్చంద్రుఁడు

---

♦ హరిశ్చంద్రుఁడు = ఒకచక్రవర్తి, ఇతనితండ్రి త్రిశంకువు, భార్య చంద్రమతి, కొడుకు లోహితాస్యుఁడు, మంత్రి సత్యకీర్తి. ఇతఁడు మహా సత్యసంధుఁడు. ఒకనాఁడు దేవేంద్రుఁడు సుధర్మాభ్యంతరమునఁ గొలువుదీరియున్నపుడు, అచటనుండిన మహర్షులంగని ప్రపంచములోపలఁ దామెఱిగిన వారిలోపల సత్యసంధుఁడెవఁడని ప్రశ్నచేయఁగా వసిష్ఠమహర్షి హరిశ్చంద్రుడని పలికెను. ఆమాటకు విశ్వామిత్రుఁడు సహింపక హరిశ్చంద్రుఁడెంత సత్యవంతుఁడా యతనిని బొంకించెదను చూడుమని శపథముచేసి యతనికి చాల యిడుములు కలుగఁజేసెను. అది యెట్లనినఁ దొలుత నితని రాజ్యమున దానరూపమునఁ బరిగ్రహించి యనంతరమంతకుముందు, ఇతఁడు తన యజ్ఞమునకై యిచ్చునట్లు వాగ్దత్తముచేసియుండిన ధనమునిమ్మని నిర్బంధించి దానికి తన భార్యనమ్మించి చండాలుని గొల్చునట్లును స్మశాన భూమియందు నివసించునట్లునుజేసి యితని కొడుకును పాముచేఁగఱపించి చంపి యావల నిరపరాధయయిన యితని భార్యపై శిశుహత్యాపాతకమును

వీరబాహునిన్ = వీరబాహుడను మాలవానిని, నిజంబుగన్ = సత్యముగా (నిశ్చయముగా) కొల్వఁడు + ఏ = సేవింపలేదా (సేవించెననుట.)

తా. హరిశ్చంద్రమహారాజు చక్రవర్తియైనను భగవత్కృపలేమంచుట చే మాలవాఁడగు వీరబాహుని సేవించినట్లే యీశ్వరుని కరుణలేని సమయమున నెంతటిఘనుఁడయినను ఐశ్వర్యములు వదలి యొక యల్పుని సేవించుచుండుట సత్యము.

ఉ. చక్కఁదలంపఁగా విధివ◆శంబున నల్పునిచేతనైనఁదా
జిక్కియవస్థలం బొరలుఁ◆జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్త్వసంపదల◆మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కియదల్చికొట్టికుది◆యించినయుండదె యోర్చి భాస్కరా

---

మోపఁజేసి యామెను శిక్షార్హురాలగునట్లుచేయించి యెట్లును బొంకింపనేరడయ్యెను. కడపట తన ప్రయత్నములెల్ల వ్యర్థములయిపోఁగా, రుద్రాదిదేవతలు హరిశ్చంద్రునికిఁ బ్రత్యక్షమయి యితని కొడుకును బ్రతికించి మరల మునుపటి యట్లె రాజ్యాధిపత్యము వహించునట్లనుగ్రహించిరి. అప్పుడు విశ్వామిత్రుఁడు తాను తీసికొన్న రాజ్యమునిచ్చి బహుకాలము శ్రమకోర్చి తపస్సుచేసి యార్జించిన మహాపుణ్యఫలము నితనికి ధారవోసి చిరకాల రాజ్యప్రదస్థుఁడవై సత్యహరిశ్చంద్రుఁడని విఖ్యాతినొందుమని యాశీర్వదించి చనియెను. కనుక నేసత్యమునందు హరిశ్చంద్రుని మించినవారులేరని విఖ్యాతిగలిగియున్నది. ఇట్లు విశ్వామిత్రుఁడు కారణములేకయే హరిశ్చంద్రుని మిగుల నిడుమలు పెట్టినందుకు వసిష్ఠుఁడతనిని బకమగునట్లు శాపమిచ్చెను, అందులకు విశ్వామిత్రుఁడతనికి, ఆడేనుఁగగునట్లు ప్రతిశాపమిచ్చెను, ఇట్లొండొరులు మాత్సర్యమున శపించుకొని పోరాడుచుండు నవసరమున బ్రహ్మ వారిని శాంతవచనములచే ననునయించి వారి పోరాటమునుడిపి వారి పూర్వరూపములను మరల వారికిచ్చి యిరువురకును మైత్రి కలుగఁజేసి పోయెను.



టీ. భాస్కరా ! చక్కన్ = బాగుగా, తలంపన్ = ఆలోచింపఁగా, చెప్పఁగన్ = పలుకుటకు, (వచించుటకు) రానిమహాబలాఢ్యుఁడున్ = వీలుపడని గొప్పసత్త్వము కలవాఁడయినను, తాన్ = తాను, విధివశంబునన్ = దైవవశముచేత, అల్పునిచేతన్ + ఐనన్ = నీచునిచేనైనప్పటికిని, చిక్కి = చిక్కుకొని, (తగుల్కొని) అవస్థలన్ = దుర్దశలను, పొరలున్ = వహించుచుండును. (పొందుచుండును.) ఎట్లనఁగా:- మావటీఁడు = ఏనుఁగును దోలువాఁడు, ఎక్కి = (ఏనుఁగుపై) కూర్చుండి అదల్చి = బెదరించి, కొట్టి = దండించి, (అంకుశముచేఁ బొడిచియనుట) కుదియించినన్ = మోకరించునట్లు (కుంగునట్లు) చేసినప్పటికిని, మిక్కిలి = ఎక్కువయిన, సత్త్వసంపదలన్ = బలాధిక్యతచేత, (అధికబలముచేత) మీఱిన = అతిశయించిన, గంధగజంబు = గర్వించిన (మదించిన) ఏనుఁగు ఓర్చి = సహించి, ఉండదు + ఎ = ఉండలేదా ? (ఉండును)

తా. మిక్కిలి సత్తువగల మదించినయేనుఁగు మావటీఁడు తనమీఁద నెక్కినను, అదలించి యంకుశమునఁ బొడిచినను, వంగఁజేసినను నన్నిటినోర్చుకొనుచున్నట్లే యెంతబల్లిదుఁడయినను దైవవశమున హీనునిచేఁజిక్కి కీడుం బొందుచుండును.

చ. చదువదియెంతగల్గిన ర◆సజ్ఞత యించుక చాలకున్న నా
చదువు నిరర్థకంబు గుణ◆సంయుతు లెవ్వరుమెచ్చరెచ్చటం

---

ఈ పద్యచరమ చరణమున "ఇంపొదవెడు నుప్పులేక రుచిపుట్టఁగనేర్చునటయ్య" అని ప్రమాణగ్రంథములలో నెందునులేని యఖండయతి పడియున్నది. దీనిని "ఇంపొదవెడునుప్పులేక రుచియుండఁగ నేర్చునటయ్య" అని "పుట్టఁగ" అనుటకు "ఉండఁగ" అనిన స్వల్పమార్పుగానాదోషము హరింప గలదని తెలియవలెను. "అందులోఁ బొదవళయున్న నుప్పురుచి పుట్టఁగ" అని చాలసవరించి "ఇంపొదవెడు అను నుప్పునఁగల విశేషమును తీసివేయుట సమ్మతము కాదని మాతలంపు.

బదనుగ మంచికూర నల ♦ పాకముచేసిననైన నందు నిం-
పొదవెడు నుప్పులేక రుచి ♦ పుట్టఁగ నేర్చునటయ్య?
భాస్కరా. 42

టీ. భాస్కరా! చదువు + అది = విద్య, ఎంతకల్గినన్ = ఎంతయెక్కువగానున్నను, రసజ్ఞత = సారమును గ్రహించుట. ఇంచుక = స్వల్పము (కొంచెము) ఎచ్చటన్ = ఎందైనను గుణసంయుతులు = యోగ్యగుణములతోఁగూడినవారు, ఎవ్వరున్ = ఏవారును (ఎవరైనను) మెచ్చరు = పొగడరు (నుతింపరు) ఎట్లన:— మంచికూరను: పదనుగన్ = పక్వముగా, నల పాకమున్ = నలచక్రవర్తి చేసినపాకముఁబోలు పాకమును, చేసినన్ = చేసినప్పటికిని, (వండినప్పటికిననుట) అందున్ = ఆకూరలలో, ఇంపు + ఒదవెడు + ఉప్పు = చక్కనిరుచిబుట్టించెడిలవణము, లేక = లేకుండ (వేయకున్నచోనని భావము) రుచి = చవి, పుట్టఁగ నేర్చునటయ్యా = కలుగఁగలదా! కలుగదనుట.

తా. కూరనెంతచక్కఁగావండినప్పటికిని దానియందుప్పులేకయుండిన రుచ్యముగానుండదు. దానినేవరును మెచ్చుకొననట్లే మానవుడెంతటివిద్వాంసుఁడైనను రసమును గ్రహింపలేకున్న వానిపాండిత్యము నిష్ప్రయోజనమగుటయేగాక యెట్టిగుణవంతులు నాతనిని నుతింపరు.

ఉ. చాలఁబవిత్రవంశమున ♦ సంజనితుం డగునేని యెట్టిదు
శ్శీలు సనైనఁదత్కులవి♦శేషము నొకపుణ్యుఁ డెంతయుం

---

దేవతలును రాక్షసులును అమృతముకొఱకుఁ బాలసముద్రమునుదరువఁగానందు ముందీ హాలాహలమనువిషవహ్ని బయలుదేరి ప్రపంచములను దహించుచుండ నాసంక్షోభము దేవతలకుఁగూడఁ దటస్థించుటంజేసియీశ్వరుని ప్రార్థింపఁగా నీవిషమును శివుండు తనకుత్తుకనిడుకొని లోకములకుఁ గలిగిన యాలజడినిమాన్పెను. ఆకారణమున నీశ్వరుండు గరళకంఠుఁడును, విషగళుండు, నీలగళుఁడు, శ్రీకంఠుఁడునని పిలువఁబడుచుండెను.



దాలిమినుద్ధరించును ♦ సుధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁడా
హాలహలానలంబుగళ♦మందుధరించుటపూని భాస్కరా. 43

టీ. భాస్కరా! చాలన్ = మిక్కిలి, పవిత్రవంశమున = శుచియైన కులమునందు, సంజనితుండు = జన్మించినవాఁడు, అగున్ + ఏని = అయినట్లయిన, తత్ + కులవిశేషముచేతన్ = వానివంశమందలి గౌరవముచే, ఎట్టి దుశ్శీలునినైనన్ = ఏలాటి చెడునడతగల వారినైనను, ఒక పుణ్యుఁడు = ఒక్క సుకృతవంతుఁడు (పుణ్యముచేసినవాఁడు) ఎంతయున్ = మిగుల (ఎక్కువ) తాలిమిన్ = ఓరిమిచేత (ఓర్పుచేత) ఉద్ధరించును = లేవనెత్తును (పూనిరక్షించును) ఎట్లనఁగా:— శంభుఁడు = శివుఁడు, పూని = యత్నించి ఆహాలహలానలంబు = ఆహాలాహలమనెడునిప్పును, గళమందున్ = కుత్తుకయందు [కంఠమందు] ధరించుట = పూనుట. (పెట్టుకొనుట) సుధానిధిన్ = క్షీరసాగరమందు (పాలసముద్రమందు) పుట్టగన్ + కాదె = జన్మించుట, వలననేకదా!

తా. ఎక్కువ భయమును గలుఁగఁజేయునదియైనను శివుఁడు హాలాహలమను నగ్నిహోత్రమును పాలకడలిలోఁ బుట్టినదను కారణమున దానిని దన కంఠమందుఁ బెట్టుకొనినట్లే యెంతదుష్టస్వభావము కలవాఁడైనను యోగ్యమయిన వంశమునఁబుట్టుటచే నావంశమందలి ఘనతచే వానినెవ్వఁడయిన పుణ్యవంతుఁడు తప్పకుండ ప్రేమించి కాపాడును.

ఉ. చేరబలాధికుండెఱిఁగి ♦ చెప్పినకార్యము చేయకుండినన్
బారము ముట్టలేఁ డొకనె♦పంబునఁదాఁ జెడునెట్టిధన్యుఁడున్
బోరక పాండుపుత్త్రులకు ♦ భూస్థలిభాగము పెట్టుమన్న కం
సారిని గాకుచేసి చెడఁ ♦ డాయెనె కౌరవభర్త భాస్కరా.

టీ. భాస్కరా! బల + అధికుఁడు = సత్తువచే గొప్పవాఁడు, చేరి = సమీపించి, ఎఱిఁగి = (ముందు కాఁబోవు విషయమును) తెలిసికొని, చెప్పిన కార్యము = చెప్పినపని, చేయక + ఉండినన్ = ఒనరింపకున్నచో (చేయని

యెడల) ఎట్టిధన్యుఁడున్ = ఎటువంటి సంపన్నుఁడును, పారము = ఒడ్డును (చివరను) ముట్టలేఁడు = చేరలేఁడు (పొందఁజాలఁడు) ఒక నెపంబునన్ = ఒక కారణమున, తాన్ = తాను, చెడుఁ = నశించును. (పాడగును) ఎట్టులనఁగా, పోరక = జగడము సేయకుండ (యుద్ధము చేయక) పాండు పుత్త్రులకున్ = పాండు కుమారులకు (పాండవులకు) భూస్థలిన్ = పుడమిని, భాగము పెట్టుము = పాలిమ్ము, అన్నకంసారిని = అనిన శ్రీకృష్ణుని, కాకుచేసి = నిందించి (తిరస్కరించి) కౌరవభర్త = దుర్యోధనుఁడు, చెడఁడాయెనె = చెడలేదా! (చెడెననుట.)

తా. దుర్యోధనునియొద్ద కరిగి కృష్ణుఁడు పాండవులకు రాజ్యమునఁ బాలుపెట్టుమని యెంతయో జెప్ప నాతని మాటలను లెక్కసేయక దుర్యోధనుఁడు పాడయినట్లే బలశాలి తనకడకే తెంచి చెప్పినపని యొనర్పనిచో నెంతవాఁడును తన పనిని నెరవేర్చుకొనఁజాలక శీఘ్రకాలమున నాశనము నొందును.

ఉ. చేసినదుష్టచేష్ట నది ♦ చెప్పక నేర్పునఁ గప్పి పుచ్చి తా
మూసినయంతటన్ బయలు ♦ ముట్టకయుండద దెట్లు రాగిపై
బూసిన బంగరుం జెదరి ♦ పోవఁగడంగిన నాఁడు నాటికిన్
దాసినరాగి గానఁబడ ♦ దా జనులెల్ల నెఱుంగ భాస్కరా.

టీ. భాస్కరా! (మనుష్యుఁడు అనునది తెచ్చిపెట్టుకొనవలెను) చేసిన దుష్టచేష్టన్ = (తాను) చేసిన దుర్మార్గకార్యము, చెప్పక = (ఎవ్వరికిని ఎఱిఁగింపక (తెలుపక) నేర్పునన్ = నిపుణతచే (ఉపాయముచేత) కప్పిపుచ్చి = అగపడకుండ నొనరించి, తాన్ = తాను, మూసినయంతటన్ = కప్పిపుచ్చినను, బయలు ముట్టక = బహిరంగము గాక (బయటపడక) ఉండదు, అది + ఎట్లు = అది యెట్లనఁగా:- రాగిపైన్ = రాగి కణికిమీఁద, పూసిన బంగరున్ = పూతపెట్టిన బంగారము, చెదరిపోవన్ = విడిపోవుటకు, కడంగినన్ = ఆరంభముకాఁగా, (మొదలు పెట్టఁగా) నాఁడు నాటికిన్ = అనాఁటికానాఁడు (క్రమక్రమముగ) దాసినరాగి = తగులుకొనియున్న తామ్రము, జనులు + ఎల్లన్ = మనుష్యులందఱు, ఎఱుంగన్ = తెలియునట్లు కానఁబడదా = అగపడలేదా (అగపడుచున్నది).



తా. తామ్రముమీఁదఁ బూఁతపెట్టిన బంగారము హరించి పోయిన తోడనే యందున్న రాగి యెల్లరికి నగపడుచున్నట్లు దుర్మార్గుఁడు తానొనర్చిన దుష్కృత కార్యము నిపుణతతోఁ గప్పిపెట్టినప్పటికి నయ్యది యెల్లరకు దెలియకుండదు.

చ. తగిలిమదంబుచే నెదిరిఁ ♦ దన్ను నెఱుంగక దొడ్డవానితో
బగఁగొని పోరుటెల్లనతి ♦ పామరుఁడై చెడుటింతెకాక తా
నెగడి జయింపనేరఁడది ♦ నిక్కము తప్పదు; ధాత్రిలోపలన్
దెగి యొకకొండతోఁ దగరు ♦ ఢీకొని తాఁకిన నేమి భాస్కరా.

టీ. భాస్కరా! తగిలి = వెన్నంటి (వెంటఁబడి) మదంబుచేన్ = గర్వముచే (మత్తతచే) ఎదిరిన్ = శత్రుబలమును, తన్నును = తన బలమును, ఎఱుంగక = గుర్తింపక, (తెలిసికొనక) దొడ్డవానితోన్ = (ఘనకార్యుని) మంచివానితో, పగన్ + కొని = శత్రుత్వము వహించి (విరోధించి) పోరుట + ఎల్లన్ = దెబ్బలాడుటయంతయు (పోట్లాడుటయంతయు) అతిపామరుఁడు + ఐ = మిక్కిలి జ్ఞానములేనివాఁడై (చాల మూర్ఖుఁడై) చెడుట = నశించుటయే, ఇంతెకాక = ఇట్లేయగును గాని (ఇంతకన్న వేఱుగా) తాన్ = తాను, నెగడి = వృద్ధిపొంది (అధికుఁడయి) జయింపనేరఁడు = సాధింపనేరఁడు, (గెలువలేఁడు) నిక్కము = సత్యము, (నిజము) తప్పదు = ఇదితప్పదు, ధాత్రిలోపలన్ = పృథివియందు (పుడమిలో) తగరు = గొఱ్ఱె (పొట్టేలు) తెగి = ధైర్యముతో [సాహసముతో] ఒక కొండతోన్ = ఒక యద్రితోడ (ఒక పర్వతముతో) ఢీకొని = ఎదుర్కొని, తాకినన్ = తలపడినయెడల (కలియంబడినచో) ఏమి = ఏమిలాభమున్నది? (ఫలము లేదనుట.)

తా. గొఱ్ఱెపోతు తెగఁబడి యొక పర్వతముతోఁ బోరాడినచోఁ దల పుఱ్ఱెపగులుటతప్ప దానివలనఫలమింతయు లేకపోవునట్లే దుర్బలుఁడు క్రొవ్వుచేఁదనయొక్కయు విరోధులయొక్కయు బలమును దెలిసికొనకుండ బల్లిదునితోఁ బోట్లాడినచోఁ దాను జెడుటయేగాని లాభమేమియును లేదు.

చ. తడవఁగరాదు దుష్టగుణుఁ♦ దత్త్వమెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణ మిట్లు వల్వదని♦ చెప్పినఁగ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁదెగఁజూచుఁగా మఱుఁగఁ♦ గాగిన తైలము నీటిబొట్టుపై
బడు నెడ నాక్షణంబెగసి♦భగ్గున మండక యున్నె భాస్కరా.

టీ. భాస్కరా! దుష్టగుణున్ = చెడ్డగుణములుగలవానిని, తత్త్వము=నిజము, ఎఱుంగక = తెలిసికొనకుండ, తడవఁరాదు = వానిమీఁది కేగఁ గూడదు, ఎవ్వరు + ఐనన్=ఏమనుజులుగాని ఆ చెడు గుణము = వారలొనరించు పాడు పని, ఇట్లు=ఈవిధము, వల్వదు=తగదు, అని, చెప్పినన్=పలికినచో (బోధించినయెడ) క్రక్కునన్=శీఘ్రముగా[త్వరగా] కోపచిత్తుఁడు + ఐ=క్రోధముతోఁ గూడిన హృదయముగలవాఁడై, కడున్ = మిగుల, తెగన్=సాహసకార్య మొనర్చుటకు, చూచుఁగా = ఎంచునుగదా [ఆలోచించునుగదా] ఎట్లనఁగా:—మఱుఁగన్ = [సల సల] ఉడుకునట్లు కాఁగిన తైలము=మఱఁగిననూనె, నీటిబొట్టు = ఉదకబిందువు, పైన్ = [తన] మీఁద (అనఁగా నూనెలోననుట) పడు నెడన్=పడునట్టివేళ, ఆక్షణంబు + ఏ=వెంటనే, ఎగసి=లేచి (ఉద్రేకించి) భగ్గునన్ = భగభగమని, మండక + ఉన్నె=మండక పోవునా? (అనఁగా మండుననుట).

తా. ఎక్కువగాఁ గాగిన చమురుమీఁద నుదకబిందువు పడినయెడల మీఁదికిలేచి భగభగమనిమండునట్లే దుర్మార్గుఁడు తనకుహితబోధసేయువారి మీఁదక్రోధమువహించి మండిపడుఁగావున నాతని జోక్యమునకువెళ్ళరాదు.

చ. తనకు ఫలంబులేదని యె♦దం దలపోయఁడు కీర్తిగోరునా
ఘనగుణశాలి లోకహిత♦కార్యము మిక్కిలిభారమైన మే



లనుకొనిపూను, శేషుఁడుస♦హస్రముఖంబులగాలిఁగ్రోలితా
ననిశము మోవఁడేమఱి మ♦హాభరమైన ధరిత్రిభాస్కరా.

టీ. భాస్కరా! కీర్తి=యశమును, కోరు=కాంక్షించు (అపేక్షించు ఆఘనగుణశాలి=ఆ మంచి గుణములచేఁ బ్రకాశించుచున్నవాఁడు, తనకున్= తనకు, ఫలంబు=లాభము, లేదు + అని=కలుగ లేదని, ఎదన్ = హృదయమునందు, తలపోయఁడు = తలంపఁడు (ఆలోచన సేయఁడు) లోకహితకార్యము= ప్రపంచములకు మేలయిన పని; మిక్కిలి = చాల (మిగుల) భారము + ఐనన్ = బరువైనను (కష్టమయినను] మేలు = మంచిది, అనుకొని = ఊహించి (తలంచి] పూనున్ = ఆ పని నొనర్ప యత్నించును, (ఎట్లనఁగా) శేషుఁడు = అనంతుఁడు (ఆదిశేషువు) సహస్రముఖంబులన్ = (తన) వేయి మోములచేత, గాలిన్=పవనమును (వాయువును) క్రోలి = పీల్చి (భక్షించి) తాన్ = తాను, మఱి, మహాభారము = మిగుల బరువైనది ఐన ధరిత్రిన్ = అయిన పృథివిని' అనిశమున్ = ఎప్పుడును, మోవఁడు + ఏ=భరింపలేఁడా! (మోయుచున్నాఁడనుట,)

తా. ఆదిశేషుఁడు గాలి నాహారము చేసికొని జగదుపకారార్థము భూమిని భరించుచున్నట్లే ప్రపంచమునఁ గీర్తిని కాంక్షించు నాతఁడు తనకు

---

శేషుఁడు=కశ్యప ప్రజాపతికిని కద్రువకును బుట్టిన పుత్రులలో జ్యేష్ఠుఁడు. ఇతఁడు తన తల్లియైన కద్రువ వినతయెడల చేసిన యక్రమమున కోర్వఁజాలక గంధమాదమున, బదరికాశ్రమము గోకర్ణము మొదలగు దివ్యక్షేత్రములయందు మహాతపమాచరింపఁగా బ్రహ్మయతని సత్యనిష్ఠకును ధైర్యమునకు మెచ్చి భూభారమును వహించునట్టి శక్తిని బ్రసాదించి గరుడునితో సఖ్యము కలిగియుండుమని చెప్పెను. అతఁడట్లే చేయుచుండెను. మఱియు నతఁడు ఈశ్వరప్రసాదముచే విష్ణువునకుఁ బానుపై వేయి పడగలతో భూమిని మోయుచు నాగులకందఱకు రాజై యుండెను. ఇతనికి భృగుమహర్షి శాపము వలన బలరామావతారము కలిగెను.

లాభము లేకున్నను ప్రపంచముం గోరి యెంతకష్టపుఁ బనినైనను నిర్వహించు నుగాని తన లాభమును మాత్రమే చూచుకొనఁడు.

చ. తనకు నదృష్ట రేఖ విశ ♦ దంబుగఁ గల్గినఁగాని లేనిచో
జనునకు నెయ్యెడన్ బరుల ♦ సంపదవల్ల ఫలంబు లేదుగా
కనుఁగవ లెస్సగాఁ దెలివి ♦ గల్గిన వారికిఁ గాక గ్రుడ్డికిన్
కనుపడునెట్లు వెన్నెలలు ♦ గాయఁగ నందొకరూపు భాస్కరా.

టీ. భాస్కరా! తనకున్ = తనకు. అదృష్టరేఖ = భాగ్యచిహ్నము, విశదంబుగన్ = విస్పష్టముగా, కల్గినన్ + కాని = ఉండిననే కాని, లేనిచోన్ = (అభాగ్యరేఖ) లేనియెడల. జనునకున్ = మానవునకు, ఏ + ఎడన్ ఎప్పుడును, (ఏసమయమందును) పరుల సంపదలవల్లన్ = ఇతరుల (అన్యుల) భాగ్యమువలన ఫలంబు = లాభము. లేదుగా = లేదుకదా, ఎట్లనఁగా:— కనుగవన్ = నేత్రద్వయమందు (రెండుకన్నులయందును) తెలివి = ప్రకాశము, లెస్సగాన్ = చక్కఁగా [బాగుగా) కల్గినవారికిఁగాక = ఉన్న మనుజులకే తప్ప. (అనఁగా దృష్టియందు దోషమింతయు లేనివారికనుట) గ్రుడ్డికిన్ = అంధుఁడగువానికి, వెన్నెలలు = చంద్రికలు కాయఁగాన్ = ప్రసరింపఁగా (వ్యాపించియుండఁగా) అందున్ = ఆ వెన్నెలలందు, ఒక రూపు = ఒక రూపమయినను; ఎట్లు కనుపడున్ = ఏరీతినగపడును? అనఁగా నగపడదనుట.)

తా. వెన్నెల లెల్లెడల నలముకొనియున్నను, దానిలో నుండురూపములు దృష్టి చక్కఁగా నున్నవారికిఁ గాన్పించునుగాని యంధున కగపడనట్లే యితరుల భాగ్యము లెల్లెడలఁ బ్రసిద్ధమైయుండినను వానివలన లాభము అదృష్టవంతులకే గాని, అదృష్టహీనులకుఁ గలుగదు.

ఉ. తాలిమితోడుతం దగవు ♦ తప్పకనేర్పరి యొప్పుదప్పులం
బాలనసేయుఁగాకటను ♦ పాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలునునీరు నేఱుపఱు ♦ పంగమరాళమెఱుంగుఁగాకమా
ర్జాల మెఱుంగునే తదురు ♦ చారురసజ్ఞతఁబూనభాస్కరా.



టీ. భాస్కరా! నేర్పరి = తెలివికలవాఁడు (నేర్పుగలవాఁడు) తాలిమి తోడుతన్ = శాంతముతో (ఓర్పుతో) తగవు = న్యాయమును, తప్పక = వీడక (వదలక) ఒప్పుతప్పులన్ = మంచిచెడ్డలను (పుణ్య పాపములను) పాలన సేయుఁగాక = పరిపాలించునుగాని (లేచి చూచునుగాని) ఆటన్ = ఆ పనిని, ఉపాయ విహీనుఁడు = నేర్పులేనివాఁడు, చేయన్ = (ఆ మంచిచెడ్డలను) చక్కబఱచుటకు, నేర్చును + ఏ = తగునా! సమర్థుఁడు కాఁడనుట.) మరాళము = అంచ (హంస) పాలును = క్షీరమును, నీరును = ఉదకమును (జలమును) ఏఱుపఱుపంగన్ = విభజించుటకు (విడఁదీయుటకు) ఎఱుంగున్ + కాని = తెలిసికొనునుగాని, మార్జాలము = పిల్లి (చీలి) తత్ = ఆయంచయొక్క, ఉరు = ఘనమయినదియు, చారు = మనోజ్ఞమైనదియు, నగు రసజ్ఞతన్ = రసమును గ్రహించుశక్తిని (అనఁగాఁ బాలును నీరును వేఱుసేయు శక్తియనుట] ఊనన్ = వహించుట [పొందుట] ఎఱుంగును + ఏ = తెలిసికొనఁగలదా [ఎఱుఁగదనుట)

తా. నీరక్షీరములను విభజన సేయుటకు రాజహంస తగునుగాని మార్జాలము తగినది కానట్లే దోషాదోషములను విడదీయుటకు నిపుణతకలవాఁడు సమర్థుఁడుగాని నేర్పులేనివాఁడు తగినవాఁడు కాఁడు.

ఉ. తాలిమితోడఁ గూరిమిఁ గృ ♦ తఘ్నునకెయ్యెడనుత్తమో
త్తముల్, మేలొనరించినన్ గుణము ♦ మిక్కిలి కీడగుఁ,
బాముపిల్లకున్, బాలిడి పెంచిన న్విషము ♦ పాయఁగనే
ర్చునె దానికోఱలం, జాలఁగనంతకంత కొక ♦ చాయను
హెచ్చునుగాక భాస్కరా. 51

టీ. భాస్కరా! ఉత్తమ + ఉత్తముల్ = మంచివారిలో మంచివారు (అనఁగా మిక్కిలి మంచివారనుట) తాలిమితోడన్ = ఓర్పుతో (శాంతముతో) కూరిమిన్ = ప్రియముచేత, కృతఘ్నునకు = చేసిన మంచిని మఱచువానికి, ఎయ్యెడన్ = ఏవేళను [ఏసమయమందును) మేలు =

మంచి (ఉపకారము) ఒనరించినన్ = చేసినచో, గుణము = తానొనర్చిన యుపకారమువలనఁ గలిగెడు లాభము, మిక్కిలి=మిగుల, కీడు + అగున్= చెడుగగును. [ఎట్లనఁగా] పాముపిల్లకున్=సర్పశిశువునకు, పాలు + ఇడి= క్షీరములుపోసి, పెంచినన్ = రక్షించినచో, దానికోఱలన్ = ఆపాము పిల్ల దంతమునందు, విషము = గరళము, చాలఁగన్ = ఎక్కువగా, అంతకంతకున్ = క్రిమక్రిమముగా, ఒకచాయన్ = ఒక రీతిగా (ఒక విధముగా) హెచ్చును గాక = అధికమగుచుండును గాని, పాయఁగన్ + నేర్చును + ఏ=పోవునా ? (ఆ విషము హరింపదనుట ]

తా. పాముపిల్లకుఁ బాలుపోసి పెంచినను, దాని కోరలయందున్న గరళము క్రమముగా వృద్ధియగుచుండును గాని తగ్గనట్లే యోగ్యులు చేసిన మంచిని మఱచెడివానికి మేలొనర్చినను, దానిచేఁ గలుగు ఫలము మిక్కిలి వ్యత్యస్తమగును.

చ. తెలియనికార్యమెల్లఁ గడతేర్చుటకొక్క వివేకిఁ జేకొనన్
వలయునటైనదిద్దుకొనవచ్చుఁబ్రయోజనమాంద్యమేమియుం
గలుగదు, ఫాలమందుఁ దిలకంబిడునప్పుడు చేతనద్దమున్
గలిగినఁ జక్కఁజేసికొనుఁగాదెనరుండదిచూచిభాస్కరా.

టీ. భాస్కరా ! తెలియని కార్యము + ఎల్లన్ = తెలియనట్టి పని నంతను, కడతేర్చుటకున్=నెరవేర్చుటకు, ఒక్క వివేకిన్ = ఒక జ్ఞానవంతుని, చేకొనన్ వలయు=చేర్చుకొనవలయును అటు + ఐనన్= అట్లయిన యెడ, దిద్దుకొనన్ వచ్చున్ = లోపములు లేకుండఁ బనిని సానుకూలము చేసికొనవచ్చును, ప్రయోజనమాంద్యము = పనికిఁ దడవు (కార్యమున కాలస్యము) ఏమియున్=ఇంచుకయును(ఎంతమాత్రమును) గలుగదు=సంభవింపదు. (ఎట్లనఁగా) నరుండు = మనుజుండు; ఫాలమందున్ = మొగమున (నుదుటను) తిలకంబును = బొట్టును, ఇడునప్పుడు = ఉంచుకొనునపుడు (పెట్టుకొనుతఱి) చేతన్=హస్తమందు (కరమున)అద్దమున్=దర్పణ



మును, కలిగినన్ = ఉన్నయెడల, అది = ఆదర్పణమును, చూచి = కనుగొని (వీక్షించి) చక్కన్ చేసికొనున్ + కాదు + ఎ = ఒప్పునట్లు సవరించుకొనునుగదా.

తా. మనుష్యుఁడు మొగమున బొట్టుపెట్టుకొనునపుడు హస్తమందద్దముండినయెడల దానినిజూచుకొని యాతిలకమును జక్కఁగాసవరించుకొనునట్లే తనకు గోచరముగాని పనిని నెరవేర్చుటకొక తెలివిగలవానిని దగ్గఱ నుంచుకొనినచో నాతనిచేఁ బనియాలస్యము గాకుండ నెరవేర్చుకొనును.

ఉ. దక్షుఁడు లేనియింటికిఁ బదార్థము వేఱొకచోటనుండి వే
లక్షలువచ్చుచుండినఁ బలాయనమైచనుఁ గల్లగాదు, ప్ర
త్యక్షము వాఁగులున్ వఱదలన్నియువచ్చిన నీరునిల్చునే
యక్షయమైనగండి తెగినట్టితటాకములోనభాస్కరా. 53

టీ. భాస్కరా , దక్షుఁడు = బాధ్యతవహించినట్టి యజమానుఁడు. లేనియింటికిన్ = లేనట్టి గృహమునకు, పదార్థము = ద్రవ్యము, వేఱు + ఒకచోటనుండి = ఇంకొకతావునుండి, వేలక్షలు = వేయిలక్షల రూప్యములు, వచ్చుచుండినన్ = వచ్చుచున్నను (ఇంటఁబడుచున్నదనుట పలాయనము + ఐ = చెల్లాచెదరై , పోవును = నశించును (అనఁగా నెప్పుడువచ్చిన పదార్థమప్పుడే యితరులు హరించు చుందురనుట) కల్లగాదు = (ఇట్లు జరుగుట) అసత్యముగాదు, (నిజము) ప్రత్యక్షము = ఇది స్పష్టము. (ఎట్లనఁగా) వాగులు = పర్వతములలో బయలుదేరు నేరులు, వరదలు + అన్నియున్ = జల ప్రవాహము లెల్ల (నీటి వెల్లువలెల్ల) వచ్చినన్=ప్రవహించుచున్నను. అక్షయము = నాశములేనిది (గొప్పది) ఐనగండి=ఐనకన్నము, తెగినట్టి తటాకములోనన్ = పడిన చెఱువులో నీరు=ఉదకము (జలము) నిల్చునే=నిలిచియుండునా (ఉండదనుట)

తా. గట్టునకుఁ బెద్ద నరదపడిన తటాకములోని కెన్నినదీప్రవాహములు వచ్చి పడినను జలము గొంచమైనను జెఱువున నిలువనట్లేకుటుంబభా

రమును బూనిన గృహయజమానుఁడు లేకున్న నెన్ని తావులనుండి యెన్ని పదార్థములు వచ్చి పడుచుండినను వెంటనే కుటుంబ భారములేని యితరులచే హరింపఁబడుచుండును గాని యేమియు నింట నిలువ యుండదు.

ఉ. దానపరోపకార గుణ ♦ ధన్యత చిత్తములోన నెప్పుడున్
లేని వివేక శూన్యునకు ♦ లేములు వచ్చినవేళ, సంపదల్
పూనినవేళ, నొక్కసరి ♦ పోలును, జీకున కర్ధరాత్రి యం
దైన నదేమి పట్టపగ♦లైనన దేమియులేదు భాస్కరా. 54

టీ. భాస్కరా! దాన=దాతృత్వము, (ఈవి) పరోపకార = ఇతరులకు మేలుచేయుట, గుణ=(మున్నగు) సద్గుణములచేత, ధన్యత = కృతార్థత్వము, ఎప్పుడున్=ఏవేళను, (ఏసమయమందును) చిత్తములోనన్=హృదయమున, లేని వివేకశూన్యునకున్ = లేకున్న యజ్ఞానికి, (లేనిమూఢునకు) లేములు=దారిద్ర్యములు, (పేదఱికములు) వచ్చినవేళన్ = సంభవించిన సమయమందు, సంపదల్=భాగ్యములు, (ఐశ్వర్యములు) పూనినవేళన్ = వహించినప్పుడు (కలిగినతఱి)ఒక్కసరిపోలును=ఒక విధముగ నేయుండును, (ఎట్లులనఁగా) చీకునకున్ = అంధునకు (గ్రుడ్డివానికి) అర్ధరాత్రి = నడురేయి, ఐనన్ + అది + ఏమి=అయినదానివలనఁ గష్టమేమి? పట్టపగలు = మధ్యాహ్నము, ఐనన్ + అది + ఏమి=అయినదానివలన ఫలమేమి? నడురేయియు, మధ్యాహ్నము నొక్కటియేగాని గ్రుడ్డివానికి నడురేయి కష్టమును.మధ్యాహ్నము సౌఖ్యమును లేదనియు రెండు నొకటియేయనియు భావము

తా. అంధునకు నడురేయియు మిట్టమధ్యాహ్నము నొక్కవిధముగనే యుండును గాని భేదమేమియు లేనట్లే దానము పరోపకారము నెన్నడు లేని మూఢునకుఁ బేదఱికము వచ్చినను సంపత్తు గలిగినను నొక తీరుగానే యుండును.

ఉ. దానము సేయఁ గోరిన వ ♦ దాన్యునకీయఁ గశక్తి లేనిచో
నైనఁ బరోపకారమున♦కై యొకదిక్కునఁ దెచ్చియైన నీఁ



బూనును, మేఘుఁ డంబుధికి♦ బోయి జలంబుల దెచ్చి యీయఁడే
వానసమస్తజీవులకు♦ వాంఛితమింపెసలార భాస్కరా. 55

టీ. భాస్కరా! దానము = ధర్మమును, చేయన్ = ఒనర్చుటకు, కోరినవదాన్యునకున్=ఇష్టముపడుతేగకానికి (దాతకు) ఈయన్ + కన్= ఒసఁగుటకు, శక్తి=సమర్థత, లేనిచోన్ + ఐనన్= లేకున్నను, పరోపకారమునకున్ = అన్యులకు మేలుసేయుటకు, ఒకదిక్కునన్ = ఇంకొకతావున, తెచ్చి + ఐనన్ = (తీసికొనివచ్చియైనను,) ఈన్= ఒసఁగుటకు (ఇచ్చుటకు) పూనును=వహించును, (యత్నము చేయును.) ఎట్లులనఁగా - మేఘుఁడు=ఘనుఁడు (మబ్బు) అంబుధికిన్ = కడలియొద్దకు (సముద్రముకడకు) పోయి=చని (వెళ్ళి) జలంబులన్ =ఉదకములను (నీటిని) తెచ్చి = తీసికొనివచ్చి, సమస్తజీవులకున్ = అన్ని జంతువులకు, వాంఛితము=కోరిక, ఇంపెసలు + ఆరన్ = నిండునట్లు (ఫలించు రీతిగా) వానన్ = వర్షమును ఈయఁడు + ఏ= ఒసఁగఁడా (అనఁగాఁ గురిపించుచుండుననుట.)

తా. మబ్బు తనయొద్ద జలములు లేని సమయమందు సముద్రునికడకేగి యుదకమును దెచ్చి సకలప్రాణికోటియు నానందించునట్లు వర్షించుచున్నట్లే దానమందాశయున్న త్యాగియుఁ దనకడ ద్రవ్యములేని సమయమున నింకొకనియొద్ద బదులు తెచ్చియైన నొసంగుచుండును.

ఉ. దానముచేయనేరనియ♦ ధార్మికుసంపద యుండియుండియున్
దానెపలాయనంబగుట♦ తథ్యముఁ బూరుగుమ్రానుఁగాచినన్
దానిఫలంబు లూరక వృ♦ధా పడిపోవవె యెండి గాలిచేఁ
గానలలోన నేమిటికి♦ గాక యభోజ్యములౌట భాస్కరా. 56

టీ, భాస్కరా! దానము=ఈవి (దాతృత్వము) చేయనేరని అధార్మికుసంపద=చేయుట కిష్టపడని ధర్మహీనుని యొక్క ఐశ్వర్యము. ఉండియుండినన్ = ఉండియుండినను, తాను + ఎ= తనంతటఁ దానె, పలాయ

నంబు + అగుట= పాఱిపోవుట, తథ్యము = సత్యము (నిశ్చయము) ఎట్లనఁగా — బూరుగుమాను =శాల్మలి వృక్షము, కాచినన్=ఫలించినను (పండినను) దాని ఫలంబు = ఆ బూరుగుచెట్టు పండ్లు, అభోజ్యములు =భుజింపదగనివి (తినఁగూడనివి) అగుటన్=అయియుండుటచేత. ఊరక= మిన్నక. వృథా=వ్యర్థముగా, ఎండి=శుష్కించి (ఎండచే నెండిపోయి) గాలిచేన్ = వాయువువలన (గాడ్పువలన) కానలలోనన్ = అరణ్యములందు (అడవులలో) ఏమిటికిఁగాక = ఎందుకుఁ బనికిరాక, పడిపోవవు + ఎ = పడిపోవుచుండలేదా (పడుచున్నవనుట )

తా. బూరుగుచెట్టు పండినను దాని పండ్లు తినుట కెవ్వరికిని పనికిరాక శుష్కించి వాయువశమున నెగురఁగొట్టఁబడి వనములయందు వృథాగాఁబడిపోవుచున్నట్లే ధర్మబుద్ధిలేనివానికి ఐశ్వర్యములున్నను నవియున్నట్లే యుండి పరులకేనకి యుపయోగము పడకపోవుచుండును.

చ. నడవక చిక్కి లేమియగు • నాఁడు నిజోదర పోషణార్థమై
యడిగిభుజించుటల్ నరుల • కారయవ్యంగ్యముకాదుపాండవుల్
గడుబలశాలులేవురు న • ఖండవిభూతిఁదొలంగి భైక్షముల్
గుడువరుయేకచక్రపురిఁ • గుంతియుఁదారొకచోటభాస్కరా

టీ. భాస్కరా ! నడవక=జరుగుబాటు లేక, లేమియగునాఁడు = దారిద్ర్యము వచ్చునపుడు (పేదఱికము సంభవించుతఱి) నిజ + ఉదరపోషణ + అర్థమై=తన కడుపు నిండించుకొనుటకు, అడిగి=కోరి (యాచించి) భుజించుటల్ = భక్షించుటలు (తినుటలు) అరయన్ = విచారింపఁగా (ఆలోచింపఁగా) నరులకున్ = మనుష్యులకు, వ్యంగ్యము= నిందింపదగినది కాదు, ఎట్లనగా:— కడున్ = మిగుల, బలశాలులు = బల్లిదులు (బలవంతులు) ఏవురు =అయిదుగురు, పాండవుల్ = పాండురాజు కుమారులు, ధర్మరాజాదులు = ధర్మరాజు, భీముఁడు, అర్జునుఁడు, నకులుఁడు, సహదేవుఁడు, అఖండవిభూతిన్ = ఎక్కువయగు నైశ్వర్యము నుండి, తొలంగి=విడిపోయి, ఏకచక్రపురిన్=ఏకచక్రమను నామముగల పట్టణమందు, తారును=తామును, (పాండవులును) కుంతియుఁ=(తల్లియైన) కుంతీదేవియు, ఒకచోటన్=ఒకస్థలమందు, భైక్షముల్ = భిక్షాటనము వలనఁ దెచ్చుకొనిన యన్నములు, కుడువరు + ఎ = భక్షింపరా ? (తినరా) (అనఁగా బిచ్చమెత్తుకొని తినిరనుట.)



తా. పంచపాండవులును బలవంతులై యుండిసకలసంపదలనువిడిచిపెట్టి తల్లియగు కుంతీదేవితోఁగూడ నేకచక్రపురమునముష్టియెత్తుకొనిజీవించుచున్నట్లే లోకములో మనుష్యుఁడు పేదఱికముననుభవించుసమయమునఁదన కడుపు నిండించుకొనుటను ఇతరుల యాచించుట తప్పులోనిదికాదు.

చ. నుడువులనేర్పు చాలని మ • నుష్యుఁడెఱుంగకతప్పనాడినం
గడుఁగృపతోఁ జెలంగుదురు • గాసియదల్పరు తజ్ఞులెల్లఁద
ప్పడుగులువెట్టుచున్నడుచునప్పుడుబాలునిముద్దుసేయఁగాఁ
దొడఁగుదు రింతేకాని పడ • ద్రోయుదురే యెవరైన
భాస్కరా. 58

టీ. భాస్కరా! నుడువులన్ = పలుకులయందు (మాటలలో) నేర్పు = చతురత, చాలనిమనుష్యుఁడు = లేనట్టిమనుష్యుఁడు, ఎఱుంగక= తెలియక, తప్పన్ + ఆడినన్ =తప్పు పలికినయెడల, తజ్ఞులు + ఎల్లన్ = విద్వాంసులందఱు, (పండితులందఱు) కడున్ = మిగుల, కృపతోన్ = కరుణతో (దయతో) చెలంగుదురు = ఒప్పుదురు (సంతోషింతురు) కాని అదల్పరు = క్రోధముతోఁ గసరరు; (ఎట్లనఁగా) తప్పు + అడుగులు = తప్పటడుగులు (అనఁగాఁ దిన్నఁగా నడువనేరని పసితనముననుట) పెట్టుచున్ = వేయుచు, నడుచునప్పుడు = నడుచు సమయమందు, బాలునిన్ = పసివానిని (పిల్లవానిని) ముద్దుచేయన్ + కాన్ = ప్రేమఁజూచుటకు, తొడఁగుదురు = ప్రయత్నింతురు (మొదలుపెట్టెదరు) ఇంతే

కాని = అంతియేకాక, యెవరు + ఐనన్ = ఎట్టి చెడ్డ మనుష్యుఁడయినను, పడన్ = క్రిందఁ పడునట్లుగా; తోఁయుదురు + ఏ = తోఁయుదురా (త్రోయరనుట)

తా. ఎటువంటిదుర్మార్గులైనను. పిల్లవాఁడుతప్పటడుగులతోనడుచునపుడువానిని పేర్మిఁజూచెదరుగాని క్రిందికి పడద్రోయనట్లే విద్వాంసులు మాటాడనేర్వనివారు తప్పుమాటలాడినను, విని సంతోషింతురుగాని కోపపడి కసరుకొనరు,

ఉ. నేరిచి బుద్ధిమంతుఁడతి ♦ నీతివివేకము దెల్పినం జెడం
గారణమున్నవాని కది ♦ కైకొనఁగూడదునిక్కమే దురా
చారుఁడు రావణాసురుఁడ♦సహ్యమునొందఁడె చేటు కాలముం
జేరువయైనవాఁడునిర♦సించివిభీషణు బుద్ధి భాస్కరా. 59

టీ. భాస్కరా ! బుద్ధిమంతుఁడు = జ్ఞానముకలవాఁడు, నేరిచి = ఆవరచుకొని, (గ్రహించి) అతినీతివివేకము = ఎక్కువయగు నీతియొక్క విశేషమును, తెల్పినన్ = తెలియఁజేయఁగా, చెడన్ = పాడగుటకు, కారణమున్నవానికిన్ = హేతువుగలవానికి, అది = ఆనీతి, కైకొనన్ = తీసికొనుటకు (గ్రహించుటకు) కూడదు = ఇష్టముండదు, నిక్కము + ఏ = నిజమే, దురాచారుఁడు = చెడ్డనడతగలవాఁడు, రావణాసురుఁడు, చేటుకాలము = చెడుకాలము, చేరువ + ఐనవాఁడు = దగ్గఱిల్లినతఱి, (సమీపించినపుడు) విభీషణుబుద్ధి = విభీషణుఁడు చెప్పిననీతిని, నిరసించి = నిందించి, (తిరస్కరించి.) అసహ్యము పొందఁడు + ఎ = రోతను జెందఁడా! అనఁగాఁ బొందెననుట).

తా. దుష్టుఁడగు రావణాసురుఁడు తనకుఁ జేటుకాలము సమీపించుటచేత సోదరుఁడగు విభీషణుఁడు పలికిన నీతివాక్యములఁ దిరస్కరించినట్లే లోకమున మనుష్యుఁడు తనకుఁ జెడుకాలము తటస్థించు సమయమున బుద్ధిమంతుఁడు పలికిన యిష్టవాక్యముల నాలకింప సమ్మతింపఁడు.



చ. నొగిలినవేళ నెంతటిఘ♦నుండునుదన్నొకరొక్కనేర్పుతో
నగపడి ప్రోదిసేయక త♦నంతట బల్మికిరాఁడు నిక్కమే
జగమున నగ్నియైనగడు ♦ సన్నగిలంబడి యున్న నింధనం
బెనయఁగఁద్రోచి యూదక మ♦ఱెట్లు రవుల్కొన నేర్చు
భాస్కరా. 60

టీ. భాస్కరా ! నొగిలినవేళన్ = దారిద్ర్యము సంభవించియున్నప్పుడు, ఎంతటి ఘనుండును = ఎంతటి గొప్పవాఁడయినను, తన్నున్ = తన్ను, ఒకరు = ఇంకొకరు, ఒక్క నేర్పుతో = ఒకయుపాయముతో, అగపడి = కాన్పించి, ప్రోదిచేయక = రక్షింపకుండ, తనంతట = తనకుఁదాను, బల్మికిన్ రాడు = బలియుఁడు (బలమునువహింపలేఁడు) నిక్కము + ఏ = సత్యమే. (నిజమే) ఎట్లనఁగా:— జగమునన్ = పుడమియందు, (భూమిలో) అగ్నియైనన్ = అగ్నిహోత్రుఁడయినను, (అనఁగాఁ తేజముతోనిండిన అగ్నియైనను అనుట) కడున్ = మిగుల, సన్నగిలంబడియున్నన్ = శుష్కించియున్నవేళయందు, (కృశించి యున్నపుడు) ఇంధనంబున్ = పుల్లను (కట్టెను) ఎగయఁగన్ + త్రోచి = ఎగసనద్రోచి, ఊఁదక = గాలిని బూరింపకున్న యెడల, మఱి ఎట్లు = ఇంక నేరీతిని, రవుల్కొనన్ నేర్చున్ = మండనేర్చును !

తా. తేజముతోనిండిన యగ్నియైనను కృశించియున్నపుడు పొయిలోని కట్టెలను చక్కఁగా నెగసనద్రోసి నేర్పుతో నూఁదినఁగాని మరల రాజి మండనట్లె యొక గొప్పవానికి పేదఱికమువచ్చినప్పుడు ఇంకొకఁడు వానిం బ్రియమునఁజేరఁదీసి రక్షించినంగాని మరల బలమును జెందనేరఁడు.

ఉ. పండితులైనవారు దిగు ♦ వందగనుండఁగనల్పుఁడొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బు♦ధప్రకరంబుల కేమియెగ్గగున్ ?
గొండొకకోఁతి చెట్టుకొన♦కొమ్మలనుండఁగఁ గ్రిందగండభే
రుండమదేభసింహ నికు♦రుంబములుండవె? చేరిభాస్కరా.

టీ. భాస్కరా! పండితులు = విద్వాంసులు, ఐనవారు = అయిన మనుష్యులు, దిగువన్ = నేలపై (క్రిందుగా) ఉండఁగన్ = నివసించియుండఁగా, అల్పుఁడు = హీనుఁడు (కొద్దివాఁడు) ఒక్కఁడు, ఉద్దండతన్ = దుర్మార్గస్వభావముచే, పీఠము + ఎక్కిన = ఆసనమునఁగూర్చుండినయెడల. (పీఠముపై నెక్కినయెడల) బుధప్రకరంబులకున్ = విద్వాంసుల సముదాయమునకు, ఏమి ఎగ్గు అగున్ = ఏమి చెడుగు సంభవించును? (ఏమియుఁ గీడు కలుగదనుట) ఎట్లనఁగా:— కొండొకకోఁతి = ఒకానొక వానరము, చెట్టుకొమ్మలన్ = తరుశాఖలయందు, ఉండఁగన్ = నివసించియుండఁగా, క్రిందన్ = చెట్టు దిగువభాగమున, గండభేరుండ = గండభేరుండమను పక్షులయొక్కయు, మద + ఇభ = మదించిన యేనుఁగులయొక్కయు, నికురుంబములు = గుంపులు, చేరి = కూడుకొని, ఉండవు + ఏ = ఉండవా? (ఉండుననుట.)

తా. వృక్షము క్రిందిభాగమున గండభేరుండ పక్షులున్నగు జంతువులుండగా నా చెట్టుకొమ్మల చివర యందొక వానరమున్నను నాజంతువులకు లోపమిసుమంతయు లేనట్లే విద్వాంసులు నేలమీఁదఁ గూర్చుండిన తఱి నల్పుఁడొకఁడు పీఠముపైఁ గూర్చుండినను దానివలన నా విద్వాంసుల కెంతమాత్రమును కొఱఁత వాటిల్లదు.

ఉ. పట్టుగనిక్కుచున్ మదముఁ ♦ బట్టిమహాత్ములఁ దూలనాడినం
బట్టినకార్యముల్ చెడును ♦ ప్రాణముఁబోవు నిరర్థదోషముల్
పుట్టు మహేశుఁగాదనికు ♦ బుద్ధినొనర్చినయజ్ఞతంత్రముల్
ముట్టకపోయిదక్షునికి ♦ మోసమువచ్చెఁ గదయ్యభాస్కరా.

టీ. భాస్కరా! మదముఁబట్టి = క్రొవ్వుచేత (గరువముచేత) పట్టుగన్ = పట్టుదలతో, నిక్కుచున్ = గర్వించుచు, మహాత్ములన్ = ఘనులను (గొప్పవారిని) తూలనాడినన్ = నొచ్చునట్లు పలికినయెడల, పట్టినకార్యముల్ = (తాను) ప్రారంభించిన పనులు, చెడును = పాడగును, (నాశనమగును) ప్రాణముల్ = అసువులు (జీవములు) పోవును, నిరర్థదోషముల్ = కార



ణములేని పాపములు, పుట్టున్ = కలుగును (సంభవించును) ఎట్లనఁగా:— మహేశున్ = శివుని, కాదని = తిరస్కరించి, కుబుద్ధిన్ = చెడ్డబుద్ధిచేత (కుత్సితమయిన బుద్ధిచే) ఒనర్చిన యజ్ఞతంత్రముల్ = చేసిన యాగకార్యములు, ముట్టక = సానుకూలముగాక (నెఱవేఱక) పోయి = నశించి (చెడి) దక్షునికిన్ = దక్షప్రజాపతికి, మోసము = కీడు, వచ్చెన్ + కద + అయ్య = కలిగెనుకదా. (కలిగెననుట)

తా. ఈశ్వరునిపైఁ గోపమున నాతనిం బిలువక దక్షప్రజాపతియజ్ఞదీక్షఁ బూనెనుగాని యాకార్యము సానుకూలము గాక పోవుటయేగాక యాదక్షునిప్రాణములకుఁగూడ మోసమువచ్చినట్లే దుర్మార్గుఁడు మత్తతచే భూమియు నాకాశము నెఱుంగక గర్వించి యుత్తములం దిరస్కరించి తానొకపని నొనర్ప యత్నించినయెడల నప్పని చెడుటయే గాక ప్రాణహాని సంభవించును. పెద్ద పాపముగూడ సంభవించును.

---

62. దక్షుఁడు = నవబ్రహ్మలలో నొక్కఁడు. కొందఱీతఁడు బ్రహ్మయొక్క యంగుష్ఠమునుండి పుట్టినవాఁడందురు. కొందఱు బ్రహ్మ మానసపుత్రుఁడందురు. ఇతని భార్య ప్రసూతి, విష్ణుపురాణములో దక్షప్రజాపతి కిరువదినలుగురు పుత్రులున్నట్లు చెప్పఁబడియున్నది. వారిలో శ్రద్ధ, లక్ష్మి, ధృతి, తుష్టి, పుష్టి, మేధ. క్రియ, బుద్ధి, లజ్జ, వపువు, శాంతి, సిద్ధి, కీర్తి, ఈ పదుమువ్వురు ధర్మునిభార్యలు. (అనఁగా ధర్మద్వారములనియెఱుంగవలయును.) వీరియందు ధర్మునకుఁబుట్టినపుత్రులు క్రమముగా, కాముఁడు, దర్పుఁడు, నియముఁడు, సంతోషుఁడు, లోభుఁడు, శ్రుతుఁడు, దండుఁడు, బోధుఁడు, వినయుఁడు, వ్యవసాయుఁడు, క్షేముఁడు, సుఖుఁడు, యశుఁడు. తొల్లిదక్షుఁడు ఈశ్వరుండు బ్రహ్మసభలో తన్నుం గాంచి గౌరవింపలేదను క్రోధమునఁ దాను యజ్ఞముచేసినపుడు రుద్రునికి హవిర్భాగ మీయనందున నాయవమానమున కోర్వక వీరభద్రుని నిర్మించి యతనిచే దక్షుని బరిమార్చి యాగము పాడుచేసెను.

చ. పరహితమైన కార్యమతి ♦ భారముతోడిదియైనఁ బూనుసత్పు
రుషుఁడు లోకముల్పొగడఁ, ♦ బూర్వమునందొక రాలవర్షమున్
గురియఁగఁ జొచ్చినన్ గదిసి ♦ గొబ్బున గోజనరక్షణార్థమై
గిరినొక కేల నెత్తెనట ♦ కృష్ణుఁడు ఛత్రముభాతి భాస్కరా. 63

టీ. భాస్కరా! పరహితము = ఇతరులకు మేలుచేయునట్టిది, ఐన కార్యము = అయినపని, అతిభారముతోడిది + ఐనన్ = మిక్కిలిబరువుతోఁ గూడినదైనను, లోకముల్ = జగత్తునందలి మనుజులు, పొగడన్ = స్తోత్రము చేయునట్లుగా, పూనున్ = ఆ పనిని జేయఁ బ్రయత్నించును, (ఎట్లనఁగా:-) పూర్వమునందున్ = మునుపటికాలమున, (ద్వాపరయుగమున) (ఇంద్రుఁడు అని తెచ్చి పెట్టుకొనవలెను) ఒక రాలవర్షమున్ = ఒక రాళ్ళవానను, (శిలావృష్టిని) కురియఁగఁ జొచ్చినన్ = వర్షించుచుండఁగా, కృష్ణుఁడు = శ్రీకృష్ణమూర్తి, గొబ్బునన్ = శీఘ్రముగా (వేగముగా) కదిసి = ఒగ్గరిల్లి. (సమీపించి) గో = గోవులను, జన = (గోపాలక) జనమును రక్షించునిమిత్తము, గిరిన్ = (మందరమను పేరుగల) కొండను, ఛత్రముభాతిన్ = గొడుగుగీతి, ఒక కేలన్ = ఒక హస్తముతో (ఒక చేతితో) ఎత్తె = మీదికెత్తి పట్టుకొనెనఁట.

తా. ఇంద్రుఁడు శ్రీకృష్ణునిమీఁద క్రోధముచేత నతనిని, అతని యావులను గోపాలురను బాధించుతలంపున శిలావర్షమును గురియించుచుండఁగా వారిం గాపాడుకొఱకు మిక్కిలికష్టమయిన పనియైనను నొకపర్వత

63. పూర్వకాలమున గొల్లలు ఇంద్రయాగమను నుత్సవమును చేయుచుండ దానిని కృష్ణుఁడు మాన్పించెనని యింద్రునకుఁ గోపమువచ్చి శిలావర్షమున వారిని గోవులను బాధించుచుండఁగా దానికి భీతినొందక యొక పర్వతమును గొడుగుగాఁ బట్టి యాకష్టమును దొలఁగించెను. అట్టికృష్ణుఁడొనర్చిన యద్భుత కార్యమునకు వాసవుండు వెఱచి యాతని దయను సంపాదించుకొనెను.



మును ఛత్రముగా బట్టికొనినట్లె మహనీయుఁడు మిక్కిలి కష్టమగు పనియైనను ఇతరుల మేలుకొఱకు లోకము పొగడునట్లు చేయుచుండును.

ఉ. పలుచనిహీన మానవుఁడు ♦ పాటిదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని ♦ మతిభాసురుఁడైన గుణప్రపూర్ణుఁ
డ, ప్పలుకులఁ బల్కఁబోవఁడు ని ♦ బద్ధిగ; నెట్లన వెల్తికుం
డఁ దాఁ, దొలఁకుచునుండుగాని మఱి ♦ తొల్కునె నిండు
ఘటంబు భాస్కరా. 64

టీ. భాస్కరా! పలుచని హీనమానవుఁడు = మిక్కిలి తేలికమనుష్యుఁడు, (అల్పుఁడు) పాటి = న్యాయమును, తలంపక = ఆలోచింపక (విచారింపక) నిష్ఠుర + ఉక్తులన్ = పరుషమగు మాటలను (కఠినములగు పలుకులను) పలుకుచుండుఁగాని = అనుచుండునుగాని = (చెప్పుచుండునుగాని) మతిభాసురుఁడు = బుద్ధిచేనొప్పువాఁడు, ఐనగుణప్రపూర్ణుఁడు = అయినట్టి మంచిగుణములచే నిండినవాఁడు. ఆ + పలుకులన్ = ఆట్టి మాటలను, నిబద్ధిగన్ = సత్యముగా (నిజముగా) పలుకన్ + బోవఁడు = సంభాషింపఁబోఁడు, ఎట్లు + అనన్ = ఏవిధముగా ననఁగా, వెల్తికుండ = (నీరు) తక్కువగానున్న కడవ, తాన్ = తాను, (అనఁగాఁ) గుండయనుట) తొలఁకుచునుండుగాని, = (కడవనిండి మీఁదికి) పొరలిపోవుచుండునుగాని (తూలిపోవుచుండునుగాని) నిండుఘటంబు = (ఉదకముచే) నిండియున్న కడవ, తొల్కును + ఎ = కదలునా? (కదలి నీరు తూలి పడదనుట.)

తా. జలము నిండుగా లేని కుండలోని నీరు తొణఁకును గాని జలముచేఁ బూర్ణముగ నిండియున్న కడవలోని జలము తొణఁకనట్లె నీచుఁడైనవాఁడు ప్రేలుచుండునుగాని, గుణవంతుఁడు అధికముగా మాటలాడఁడు.

చ. పలుమఱు సజ్జనుండు ప్రియ ♦ భాషలెపల్కుఁగఠోరవాక్య
ముల్, పలుకఁ డొకానొకప్పుడవి ♦ పల్కిన గీడునుగాదు;

65. పల్కు = మాట, గింజలోని పలుకు అని యర్థములు.

నిక్కమే, చలువకువచ్చి మేఘుఁ డొక ♦ జాడను దానడగండ్లు రాల్చినన్, శిలలగునోటు వేగిరమె ♦ శీతలనీరము గాక భాస్కరా. 65

టీ. భాస్కరా! సజ్జనుండు = యోగ్యుఁడు (సత్పురుషుఁడు) పలుమఱు = అనేక పర్యాయములు (తఱచు) ప్రియభాషలు + ఎ = ఇష్టమైన మాటలే (మంచిపలుకులే) పల్కున్ = ఆడుచుండును. (వచించుచుండును) కఠోరవాక్యముల్ = కఠినపుబలుకులు (చెడ్డమాటలు) పలుఁకఁడు = వచింపఁడు (మాటలాడఁడు) ఒకానొకప్పుడు = ఒకానొక వేళయందు, అవి = ఆ చెడుమాటలను. పల్కినన్ = వచించినప్పటికి, కీడునుకాదు = చెడుగును కాదు, నిక్కము + ఏ = నిజమే (సత్యమే) ఎట్లనఁగా:— చలువకున్ = చల్లదనమును బుట్టించుటకు, వచ్చి = ఏతెంచి, (అవతరించియనుట) మేఘుఁడు = ఘనుఁడు (మబ్బు) తాన్ = తాను, (అమబ్బనుట) వడగండ్లన్ = కరకలను, రాల్చినన్ = వర్షించినను, (కురిపించినను) వేగిరము + ఎ = శీఘ్రముగానే (త్వరగానే) శీతలనీరముగాక = చల్లని జలముగాకుండ, శిలలగునోటు = తాళ్ళగునా (కావనుట)

తా. మబ్బు నీటిబిందువులను కురిపించుచు ఒకానొక సమయమున వడగండ్లను గురిపిన్నను అవి తాళ్ళంబోలె కఠినముగా నుండక కరఁగి నీరగు నట్లే సత్పురుషుఁడు సర్వకాలములయందును మంచి పలుకులనే పల్కుచు నొకానొక సమయమునఁ బరుషవాక్యములు పలికినను ఆమాటలు [redacted] జేయక శుభములుగనే పరిణమించును.

ఉ. పాపపుఁద్రోవవాని కొక ♦ పట్టున [redacted]
లోపలదుర్గుణంబె ప్రబ ♦ [redacted]
బాపటకాయకున్ ను
రూపున దావి



టీ. భాస్కరా! పాపపుఁద్రోవవానికిన్ = దుర్మార్గునకు, ఒకపట్టునన్ = ఒకప్పుడు, మేను = శరీరము (ఒడలు) వికాసము = ప్రకాశమును (కాంతిని) బొందినన్ = వహించినను, లోపలన్ = చిత్తమునందు (హృదయమున) దుర్గుణంబు + ఎ = పాడుగుణమే, ప్రబలుంగద = పెరుగును గదా! (వృద్ధియగునుగదా) అతనిన్ = ఆ దుర్మార్గుని, నమ్మఁగన్ కూడదు = నమ్మరాదు, పాపటకాయకున్ = వృకధూమమున, పైపయిన్ = మీఁదమీఁద, నునుపు = స్నిగ్ధత (నున్నదనము) కల్గినన్ = ఉన్నచో, కల్గున్ + కాక = ఉండునుగాని, దానిలోన్ = ఆ పాపటకాయయందు, కల = ఉన్నట్టి, విరుద్ధపు = వికటమైన (అసహ్యమైనయనుట) చేదు = విషము (తిక్తత) ఏరూపునన్ = ఏతెఱంగున, నశించున్ = హరించును? (పోవును?) (పోదనుట)

తా. పాపటకాయమీఁదిభాగము నునుపుగానుండినను, [redacted] నుండిన చేదు పోనట్లే దుర్మార్గునకు ఒక [redacted]
హృదయమునఁగల చెడగు[redacted]

ఉ. [redacted]

నిక్కమే, చలువకువచ్చి మేఘుఁ డొక ♦ జాడను దావడగం
డ్లరాల్చినన్, శిలలగునోటు వేగిరమె ♦ శీతలనీరము గాక
భాస్కరా. 65

టీ. భాస్కరా! సజ్జనుండు = యోగ్యుఁడు (సత్పురుషుఁడు) పలుమఱు = అనేక పర్యాయములు (తఱచు) ప్రియభాషలు + ఎ = ఇష్టమైన మాటలే (మంచిపలుకులే) పల్కున్ = ఆడుచుండును. (వచించుచుండును) కఠోరవాక్యముల్ = కఠినపుబలుకులు (చెడ్డమాటలు) పలుకఁడు = వచింపఁడు (మాటలాడఁడు) ఒకానొకప్పుడు = ఒకానొక వేళయందు, అవి = ఆ చెడుమాటలను. పల్కినన్ = వచించినప్పటికి, కీడునుకాదు = చెడుగును కాదు, నిక్కము + ఏ = నిజమే (సత్యమే) ఎట్లనఁగా:— చలువకున్ = చల్లదనమును బుట్టించుటకు, వచ్చి = ఏతెంచి, (ఆవరించియనుట) మేఘుఁడు = ఘనుఁడు (మబ్బు) తాన్ = తాను, (ఆమబ్బనుట) వడగండ్లన్ = కరకలను, రాల్చినన్ = వర్షించినను, (కురిపించినను) వేగిరము + ఎ = శీఘ్రముగానే (త్వరగానే) శీతలనీరముగాక = చల్లని జలముగాకుండ, శిలలగునోటు = ఱాళ్ళగునా (కావనుట)

తా. మబ్బు నీటిబిందువులను గురిపించుచు ఒకానొక సమయమున వడగండ్లను గురిసినను అవి ఱాళ్ళంబోలె కఠినముగా నుండక కరఁగి నీరగునట్లే సత్పురుషుఁడు సర్వకాలములయందును మంచి పలుకులనే పల్కుచు నొకానొక సమయమునఁ బరుషవాక్యములు పలికినను ఆమాటలు చెడుగు జేయక శుభములుగనే పరిణమించును.

ఉ. పాపపుఁద్రోవవాని కొక ♦ పట్టున మేను వికాసమొందినన్
లోపలదుర్గుణంబె ప్రబ ♦ లుంగద నమ్మఁగఁగూడ దాతనిన్
బాపటకాయకున్ నునుపు ♦ పైపయిఁ గల్గినఁ గల్గుఁగాక యే
రూపున దానిలోఁగలవి ♦ రుద్ధపుఁజేదు నశించు భాస్కరా. 66



టీ. భాస్కరా! పాపపుఁద్రోవవానికిన్ = దుర్మార్గునకు, ఒకపట్టునన్ = ఒకప్పుడు, మేను = శరీరము (ఒడలు) వికాసము = ప్రకాశమును (కాంతిని) ఒందినన్ = వహించినను, లోపలన్ = చిత్తమునందు (హృదయమున) దుర్గుణంబు + ఎ = పాడుగుణమే, ప్రబలుంగద = పెరుగును గదా! (వృద్ధియగును గదా) అతనిన్ = ఆ దుర్మార్గుని, నమ్మఁగన్ కూడదు = నమ్మరాదు, పాపటకాయకున్ = వృకధూమమునకు, పైపయిన్ = మీఁదమీఁద, నునుపు = స్నిగ్ధత (నున్నదనము) కల్గినన్ = ఉన్నచో, కల్గున్ + కాక = ఉండును గాని, దానిలోన్ = ఆ పాపటకాయయందు, కల = ఉన్నట్టి, విరుద్ధపు = వికటమైన (అసహ్యమైనయనుట) చేఁదు = విషము (తిక్తత) ఏరూపునన్ = ఏ తెఱఁగున, నశించున్ = హరించును? (పోవును?) (పోదనుట )

తా. పాపటకాయమీఁదిభాగము నునుపుగానుండినను, ఆకాయలోనుండిన చేఁదు పోనట్లే దుర్మార్గునకు ఒకప్పుడు సౌందర్యము కలిగియున్నను హృదయమునఁగల చెడ్డగుణము పోదు గావున నట్టివానిని నమ్మఁగగదు.

ఉ. పూనినభాగ్యరేఖ చెడి ♦ పోయినపిమ్మట నెట్టిమానవుండైన
ను వానినెవ్వరుఁ బ్రి ♦ యంబునఁ బల్కరు పిల్వరెచ్చటం, దా
నిది యెట్లొకో యనినఁ ♦ దథ్యము పుష్పము వాడివాసనా, హీ
నతనొందియున్న యెడ ♦ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా.

టీ. భాస్కరా! పూనినభాగ్యరేఖ = మున్ను తన్ను వహించినయదృష్టపుగీత, చెడిపోయిన పిమ్మటన్ = పాడైనవెనుక, ఎట్టిమానవుండు + ఐనను = ఎంతటి గొప్పమనుష్యుఁడయినను, ఎచ్చటన్ = ఏతావునందైనను, (ఎచ్చోటనైనను) వానిని = ఆభాగ్యహీనుని, ఎవ్వరున్ = ఏమనుష్యులును, ప్రియంబునన్ = ఇష్టముచేత (కూరిమిచేత) పల్కరు = మాటలాడరు, పిల్వరు = చీరరు (రమ్మనరు) తథ్యము = నిజము, తాన్ = అది, (అయ్యది) ఎట్లు + ఒకో + అనిన్ = ఏరీతిననిన, పుష్పము = సు

మము (పూవు), వాడి = ఎడలిపోయి, (ఎండి) వాసనాహీనతన్ = మంచి పరిమళము లేకుండుటను, ఒంది = చెంది (వహించి) ఉన్న + ఎడన్ = ఉండినవేళయందు, ఎవ్వరున్ = ఏమానవులయినను, ముట్టుదురు + అయ్యా = స్పృశింతురా? (అంటుదురా) అనఁగా తాకరనుట.

తా. పూవువడలి పరిమళహీనమైన సమయమున దాని నెవ్వరును ముట్టనట్లే యైశ్వర్యరేఖ పాడుపడిన మనుజులెంత గొప్పవారైనను దగ్గఱకుఁ బిల్వకపోవుటయేగాక పలుకనైనఁ బలుకరు.

ఉ. పూరిత సద్గుణంబుగల ♦ పుణ్యున కించుక రూపసంపదల్
దూరములైన వానియెడ ♦ దొడ్డగఁజూతురుబుద్ధిమంతు లె
ట్లారయ గొగ్గులైన మఱి ♦ యందుల మాధురిఁజూచికాదె
ఖర్జూరఫలంబులం బ్రియము ♦ చొప్పడ లోకులు గొంట
భాస్కరా! 68

టీ. భాస్కరా! పూరితసద్గుణంబు = పూర్ణమయిన యోగ్యగుణము. కలపుణ్యునకున్ = ఉన్నట్టి పుణ్యవంతునకు, ఇంచుక = స్వల్పము (కొంచెము) రూపసంపదల్ = అందముయొక్క కలుములు, దూరములు + ఐనన్ = ఉండకపోయినను (లేకున్నను) వానియెడన్ = అట్టివాని విషయమై, బుద్ధిమంతులు = జ్ఞానము కలవారు, దొడ్డగన్ = ఘనముగా (గౌరవముగా) చూతురు = కాంచెదరు, (కనుఁగొందురు) ఎట్లు = ఏగీతిననఁగా, అరయన్ = విచారింపఁగా, లోకులు = ప్రజలు, (జనులు) గొగ్గులైనన్ = ముడతలు గలిగియున్నను, ఖర్జూరఫలంబులన్ = పేరీదు పండ్లను, ప్రియముచొప్పడన్ = హితమగునట్లు (ఇష్టమగునట్లుగా) కొంట = వెలకు దీసికొనుట, మఱి = ఇంతియకాక (ఇంకను) అందుల = ఆపండ్లయందున్న, మాధురిన్ = మధురిమను, (తియ్యఁదనమును) చూచినకాదె = కాంచియేకదా (అనఁగా రుచి కనుగొనియేకదా యనుట.)



తా. ఖర్జూరపుపండ్లు పయికి గొగ్గిగొగ్గిగా నున్నను వానియందుఁగల మాధుర్యమును జూచి యెల్లవారును నిష్టముతోఁ గొనునట్లే మంచిగుణవంతునకు సౌందర్యము లేకుండినను వానిని జ్ఞానులు ఘనునిగా నెంచిపూజింతురు.

ఉ. ప్రల్లదనంబుచే నెఱుక ♦ పాటొకయింతయు లేక యెచ్చటన్
బల్లిదుడైన సత్ప్రభున ♦ బద్ధములాడిన ద్రుంగిపోదు; రె
ట్లల్లసభాస్థలింగుమతు ♦ లై శిశుపాలుఁడుదంతవక్త్రుఁడుం
గల్లలుగృష్ణునింబలికి ♦ కాదె హతంబగుటెల్ల భాస్కరా! 69

టీ. భాస్కరా! ప్రల్లదనంబుచేన్ = వదరుబోతుఁదనముచేత, ఎఱుకపాటు = తెలివి గలిగియుండుట, ఇంచుక లేక = లేశమయినను లేక (కొంచెమును లేక) ఎచ్చటన్ = ఎందయినను, బల్లిదుఁడు = బలము కలవాఁడు, (శౌర్యవంతుఁడు) ఐనసత్ప్రభునిన్ = అయినట్టి మంచి యేలికను గూర్చి, అబద్ధములాడినన్ = లేని పోనివి చెప్పినచో (కల్లలు పలికిన యెడల) త్రుంగిపోదురు = నాశనము జెందుదురు, ఎట్లు = ఏరీతిననఁగా, శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడును, హతంబగుటెల్లన్ = నాశనమగుట యంతయు, అల్ల

---

69. శిశుపాలుఁడు, దంతవక్త్రుఁడు = చేదిదేశాధీశ్వరుండగు శిశుపాలుఁడు తన సోదరుండగు దంతవక్త్రునితో మిక్కిలి దుర్మార్గకార్యము లొనర్చుచుండిరి. వీండ్రిరువురును సనకసనందనాది మహర్షులచే శాపముం గాంచిన శ్రీకృష్ణ ద్వారపాలురగు జయ విజయులు. ఈ శిశుపాల దంతవక్త్రులు శ్రీకృష్ణునియందు బద్ధవైరము కలవారు. ధర్మరాజు సేయుచున్న రాజసూయయాగమున సభలోఁ గృష్ణుని పురుషోత్తమునిగా నిర్ణయించి యాతనిం బూజించి యగ్రతాంబూలము కృష్ణునికిచ్చుటం జూచి సహింపక పలువిధముల నిందించుటచే శిశుపాలుని కృష్ణుఁడు తన చక్రధారకాహారముగా నొనర్చెను. పదంపడి దంతవక్త్రుఁడు అన్ననుజంపినందున శ్రీకృష్ణునకుఁ జెడ్డసేయువాఁడై సంచరించుచుండఁ గొంతకాలమునకు దంతవక్త్రునిం గూడ మ్రందఁజేసెను.

సభాస్థలిన్=(పూర్వపు ధర్మరాజు రాజసూయయాగమునందలి) సభామంట
పమున; కృష్ణునిన్=శ్రీకృష్ణమూర్తిని గూర్చి. కల్లలుపల్కి-కాదె=నిందిం
చుటవలననే కదా !

తా. ధర్మరాజాచరించు రాజసూయ సందర్భమున సమావేశమయిన సభ్యులనడుమ శిశుపాల దంతవక్త్రులు మంచి చెడ్డల నాలోచించుకొనక శ్రీకృష్ణమూర్తిని నిందించి యాపురుషోత్తమునిచే మృతినొందినట్లే తెలివిహీనుఁడైమనుష్యుఁడుమహాబలవంతుఁడగుప్రభువుందూలనాడినచావకమానడు.

ఉ. ప్రేమనుఁగూర్చి యల్పునకుఁ ♦ బెద్దతనంబునుదొడ్డవానికిం
దా మతితుచ్ఛపుంబని నె ♦ దంబరికింపక యీయరాదుగా;
వామకరంబుతోడఁగుడు♦వం గుడిచేత నపానమార్గముం
దోమఁగవచ్చునేమిగులఁ♦దోచనిచేఁతలుగాక భాస్కరా. 70

టీ. భాస్కరా! ప్రేమను గూర్చి = దయజూచి, అల్పునకున్ = హీనునకు (నీచునకు) పెద్దతనంబును=అధికారమును గొప్ప యుద్యోగమును, దొడ్డవానికిన్=మంచివానికి (యోగ్యునకు) తాము = ఏలికలైన వారు (ప్రభువులు) తుచ్ఛపుంబని=నీచకార్యమును (కొద్దియుద్యోగమును) ఎదన్=హృదయమందు (ఎడఁదయందు) పరికింపక=ఆలోచింపక, ఈయరాదుగా=ఒసఁగఁగూడదు కదా ! (ఎట్టులనఁగా:—)మిగులన్=(ఇవి) మిక్కిలి. తోఁచనిచేతలు, కాక=మంచి చెడ్డల నాలోచింపక చేయు పనులు గాక, వామకరంబుతోడన్=ఎడమచేతితో. కుడువన్=భక్షించుటయు, (తినుటయు) కుడిచేతన్ = దక్షిణకరంబున (కుడిచేతితో) అపానమార్గమున్=గుదస్థానమును (మలమును విడిచెడిచోటును) తోమగన్=కడుగుటయు, వచ్చునే! తగునే=తగునా ! (తగదనుట.)

తా. ప్రపంచమందు మనుష్యున కెడమచేతఁ దినుటయుఁ గుడిచేత గుదప్రక్షాళనము గావించుకొనుటయుఁ గూడనట్లే నృపాలురు,అల్పునకుఁ బెద్దయుద్యోగ మొసంగుటయు ఘనులకుఁ గొద్దిపాటి యుద్యోగములొసంగుటయుఁ దగదు.



చ. ఫలమతిసూక్ష్మమైనసన్నృ♦పాలుఁడుమంచిగుణాఢ్యుఁడైనచో
నెలమి వివేకులాతని క ♦ పేక్షయొనర్తు, రదెట్లు చంద్రికా
విలసన మైనఁ దా మనుభ ♦ వింపఁజకోరములాసఁ జేరవే
చలువగలట్టివాఁడగుటఁ♦జందురు నెంతయుఁగోరి భాస్కరా.

టీ. భాస్కరా ! నృపాలుఁడు=ప్రభువు (రాజు) మంచిగుణాఢ్యుఁడు=సద్గుణములచేనిండినవాఁడు,ఐనచోన్ =అయినయెడల, ఫలము=లాభము అతిసూక్ష్మము = మిగుల దక్కువ. ఐనను = అయినప్పటికిని, వివేకులు= జ్ఞానముగలవారు, ఎలమిన్ = సంతసముతో, అతనికిన్ = అనృపునికొఱకు అపేక్ష ఒనర్తురు =ఇష్టపడుచుందురు. (కోరుచుందురు.] అది + ఎట్లు= అది యెట్లనఁగా, చంద్రికావిలసము + ఐనన్=వెన్నెలకాంతిమాత్రమే యైనను, చకోరము=చకోరపక్షులు (వెన్నెలపులుఁగులు) చలువగల + అట్టివాఁడు= శీతలత్వమున నొప్పువాఁడు (చల్లనివాఁడు)అగుటన్=అయిన హేతువుచేత, ఎంతయున్=చాల (మిగుల) చందురున్=శశిని (చంద్రుని) కోరి = అపేక్షించి, తాము=ఆ చకోరములు, అనుభవింపన్ = ఆ వెన్నెలనే భక్షించుటకు, ఆసన్=కోరికతో, చేరవే = ఆచంద్రునిదగ్గఱకు వెళ్ళవా ? (అనఁగా వెళ్ళుననుట.)

తా. చకోరములు తమకు చందమామవలనఁ గాంతికన్న నెక్కుడు లాభములేకున్నను జల్లనివాఁడగుటచే నాచంద్రోదయముం గోరుచుందునట్లే ప్రభువు యోగ్యుఁడయినయెడల నాతనివలన లాభ మెక్కుడు లేకున్నను మోదమున నాప్రభువునే కోరుచుందురు.

ఉ. బంధురసద్గుణాఢ్యుఁడొక♦పట్టున లంపటనొందియైన దు
స్సంధిఁదలంపడన్యులకుఁ♦జాలహితం బొనరించుఁగాక శ్రీ
గంధపుఁజెక్క రాగిలుచుఁ ♦ గాదె శరీరుల కుత్సవార్థమై
గంధములాత్మఁబుట్టదఱు♦గంబడియుండుట లెల్ల భాస్కరా.

టీ. భాస్కరా ! బంధుర=ఒప్పుచుండెడు, సగుణ=యోగ్యగుణము

లను, అఢ్యుఁడు=అధికారిగ్యైనవాఁడు (అనఁగా మంచిగుణములన్నియుఁగల వాఁడనుట) ఒకపట్టునన్= ఒకానొక వేళయందు లంపటన్ = చిక్కును, (కష్టమును) ఒందియైనను=పడియైనను. అన్యులకున్=ఒరులకు, (ఇతరులకు) హితంబున్=ఇష్టమును (మంచిని) ఒనరించుఁ=చేయును ; (కాని) దుస్సంధిఁ=అనిష్టమును (కీడును) తలంపఁడు=విచారింపఁడు (అనఁగాఁ జేయఁడనుట) ఎట్టులనఁగా:—శ్రీగంధపుఁజెక్క=మంచిగంధపుఁ జెక్క, రాగిలుచున్=చక్కఁగా నొప్పుచు, గంధములు = సువాసనలు (పరిమళములు) ఆత్మన్=తనలో, పుట్టన్=కలుగునట్లు, తఱుగంబడి=తగ్గిపోయియుండుట ఎల్లశరీరులకున్=జీవములన్నిటికిని (ఎల్లజంతువులకనుట) ఉత్సవ + అర్థము= వేడ్కకొఱకు, ఐకాదె=అయికదా ? (అవుననుట.)

తా. మంచిగంధపుఁజెక్క తన యందుఁ బరిమళములు గలుగునట్లు హరించుచుఁ బ్రజలకు, ఆనందముఁ గలుగఁజేయునట్లే గుణవంతుఁడు తానెన్నిచిక్కులు పడుచున్నను నితరులకుఁగీడు సేయక మేలునొనర్చుచుండును.

చ. బలముదొలంగుకాలమునఁ ♦ బ్రాభవసంపద లెంతధన్యుడున్
నిలుపుకొనంగనోపఁ; డది నిశ్చయ మర్జునుఁ డీశ్వరాదులం
గెలిచినవాఁడుబోయలకుఁ ♦ గీడ్పడిచూచుచుఁగృష్ణుభార్యలం
బలువురనీయఁడేనిలుపఁ ♦ బట్టసమర్థుఁడుగాక భాస్కరా 73

73. బలరాముఁడును కృష్ణమూర్తియు నిర్యాణముం బొందినతరువాత నర్జునుఁడు వారిభార్యలను గాపాడుచుండఁగానొకానొకదినమున వ్యాధులు కృష్ణునియందు వైరముగలవారయి యాతనిసతుల బలాత్కరించియెత్తుకొని పోవుచున్న సమయమందుఁ బాండవమధ్యముండగు నర్జునుండు, ఆబోయవాండ్రతో యుద్ధముచేసి యోడిపోవ నాబోయలు కృష్ణుని యిల్లాండ్రం బెక్కురను దీసికొనిపోయిరి. దీని కంతకును గారణము శ్రీకృష్ణుడున్నతటి యీశ్వరునిజయించి పాశుపతాస్త్రములం జేకొనినయర్జునుఁడే కృష్ణబలము అనఁగా దైవబలము తగ్గుటచే బోయవాండ్రం గెలువలేకపోయెను!



టీ. భాస్కరా ! బలము = దైవబలము, తొలంగు కాలమునన్=నశించునప్పుడు, ఎంతధన్యుఁడున్ = ఎటువంటి సంపన్నుఁడును, ప్రాభవసంపదలు=ప్రభుత్వపు ఐశ్వర్యములు, నిలుపుకొనంగన్=ఆపుకొనుటకు, చాలఁడు=సమర్థుఁడుకాఁడు, అది=ఆవిషయము.నిశ్చయమే = సత్యమే (నిజమే) ఎట్లనఁగా:—ఈశ్వరాదులన్ = శివుఁడుమున్నగువారిని, గెలిచినవాఁడు=ఓడించినవాఁడగు (జయించినవాఁడగు) అర్జునుఁడు = పార్థుఁడు, (పాండవమధ్యముఁడు) బోయలకున్=చెంచువాండ్రకు, కీడ్పడి = వశమై (లోఁబడి) చూచుచు=వీక్షించుచు (కాంచుచు) పలువురన్=చాలమందిని, కృష్ణుభార్యలన్=శ్రీకృష్ణుని పెండ్లాములను, నిలుపఁబట్టన్ = ఆపియుంచుటకు, సమర్థుఁడు కాక=తగినవాఁడు కాక, ఈయఁడే = (బోయలకు) ఇచ్చినాఁడు కాఁడా ! (ఇచ్చెననుట).

తా. ఈశ్వరాదులను గెలిచిన యర్జునుఁడు కృష్ణునిభార్యలఁగాపాడ సమర్థుఁడు కానట్లే దైవబలము లేకున్న నెంతటివాఁడును దన గౌరవమును నిలుపుకొన నేరడు.

చ. బలయుతుఁడైనవేళనిజ ♦ బంధుఁడుతోడ్పడుఁగాని యాతడే
బలముతొలంగెనేనితన ♦ పాలిటిశత్రు; వదెట్లుపూర్ణుఁడై, జ్వ
లనుఁడుకానఁగాల్చుతఱి ♦ సఖ్యముఁజూపుచు వాయుదేవుఁడా
బలియుఁడుసూక్ష్మదీపమగు ♦ పట్టునార్పదెగాలి భాస్కరా.

టీ. భాస్కరా ! బలయుతుఁడు = శౌర్యము కలవాఁడు, ఐనవేళ = అయిన సమయమందు, నిజబంధుఁడు = తనచుట్టము, తోడ్పడుఁగాని=సాయమగును గాని (సహాయముపడును గాని) ఆతఁడే = ఆచుట్టమే (ఆబంధువుఁడే) బలము=శక్తిని, తొలంగెనేని=వదలియున్న యెడల, తన పాలిటిశత్రువు=తనకు విరోధియే యగును. అది + ఎట్లు=అదియేరీతి ననఁగా, జ్వలనుఁడు=వహ్ని (అగ్నిదేవుండు) పూర్ణుఁడై=నిండినవాఁడై (అధికుఁడై యనుట) కానన్=అరణ్యమును (అడవిని) కాల్చుతఱిన్ = దహించునట్టి

సమయమందు (మండించునపుడు) వాయుదేవుఁడు = పవనుఁడు (గాలి) సఖ్యము=మైత్రి (స్నేహము) చూపును=కనబరచునుగాని, అబలియుఁడు = అబలశాలియగు నగ్నిహోత్రుఁడు, సూక్ష్మదీపము=చిన్నదివ్వె (కొద్దిదీపము) అగుపట్టునన్=అగువేళ (దీపముతగ్గిబలము మిణుకుమిణుకు మనునపుడనుట) గాలి=వాయువు. ఆర్పదు + ఎ=పోగొట్టదా (ఆర్పుననుట)

తా. ఎక్కువ బలముగలవాఁడై యగ్నిదేవుఁడు అరణ్యములను గాల్చు సమయంబున వాయువాతని వృద్ధికి దోడ్పడుచు నాయగ్ని చిన్నదీపమయి బలము తక్కువగా నున్నపుడు ఆవాయువే విరోధియై దాని నార్పునట్లే ప్రపంచమున మనుజుఁడు బల్లిదుఁడైయున్న సమయమున స్నేహితుఁడు దోడుపడుచు బలము తగ్గినతఱి నాస్నేహితుఁడే విరోధియై నాశనముజేయుచుండును.

ఉ. బల్లిదుఁడైన సత్ప్రభువు♦పాయకయుండినఁగాని రచ్చలోఁ
జిల్లరవారు నూఱుగురు ♦ సేరినఁ దేజము గల్గదెయ్యెడన్,
జల్లని చందురుం డెడసి♦సన్నపుఁజుక్కలు కోటియున్నరం
జిల్లునె వెన్నెలల్ జగముఁ♦చీకటులన్నియుఁబాయభాస్కరా.

టీ. భాస్కరా! బల్లిదుఁడు = బలముకలవాఁడు, ఐనసత్ + ప్రభువు=అయినట్టి యోగ్యుఁడయిన నృపాలుఁడు, రచ్చలోన్ = సభలో, పాయక=వదలక, ఉండినఁగాని = ఉండిననేగాని, చిల్లరవారు =అల్పులు (కొద్దివారు) నూఱుగురు=నూఱుమంది, చేరినన్ = కలిసినప్పటికిని, ఎయ్యెడన్ = ఎందును, తేజము=ప్రకాశము (కాంతి) కలుగదు = సమకూరదు, (లభింపదు) ఎట్లనఁగా:—చల్లనిచంద్రుఁడు = శైత్యము నొసంగెడు శశి, ఎడసి=లేకుండ, సన్నపుఁజుక్కలు=అల్పకాంతిగల నక్షత్రములు, కోటి = కోటిసంఖ్య, ఉన్నన్=ఉండినను, వెన్నెలల్ = చంద్రికలు, జగము చీకటులు అన్నియున్=ప్రపంచమునందలి యంధకారములన్నియు, పాయన్=తొలగునట్లు (పోవునట్లు) రంజిల్లును + ఎ=వెలుఁగునా, (వెలుంగవనుట).



తా. చంద్రోదయసమయమున మంచివెన్నెలలు పుట్టునుగాని నక్షత్రములెన్నియుండినను ప్రపంచమునందలి చీకట్లుపోవునట్టి చంద్రికవ్యాపింపనట్లే మంచి రాజేంద్రుఁడొక్కఁడు యుండిన సభప్రకాశించునట్లు సాధారణజను లెందఱున్నను గాంతివంతముగాదు.

చ. భుజబలశౌర్యవంతులగు♦ పుత్త్రులగాంచినవారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు♦నిక్కముచేకుఱుఁగుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁడర్జునుఁడు ♦ వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రత♦కార్యముదీర్చఁడెతొల్లి భాస్కరా.

టీ. భాస్కరా! భుజబల = బాహుబలము, శౌర్యవంతులు = పరాక్రమవంతులునగువారు, అగుపుత్రులున్=అయిన కుమారులను, కాంచినవారికిన్ = కనినవారికి, ఏ + ఎడన్ — ఏయెడన్ = ఎచ్చోటనయినను. నిజ + హృదయ + ఈప్సిత + అర్థములు = తన చిత్తమునకుఁ బ్రియమైనపనులు, నిక్కము = నిజముగా, చేకుఱున్=నెఱవేఱును, (ఎట్లనఁగా) తొల్లి=మున్ను (పూర్వము) కుంతిదేవికిన్=కుంతీదేవికి, విజయ=ఎక్కువ జయముచేతను, బల = శౌర్యముచేతను, ఆఢ్యుఁడు = గొప్పవాఁడు, (అగు) అర్జునుఁడు=కిరీటి, వీరపరాక్రమము = శౌర్యవంతు

---

76. తొల్లి గాంధారి నారదోపదేశంబున గజగౌరీవ్రత మొనరించుటకై మట్టియేనుంగును గావించి యావ్రతమును నెరవేర్చుకొనెనని విని కుంతీదేవి తాను నా వ్రతమునుజేయవలయుననియున్నదని కుమారులకుంజెప్పినతోడనే యర్జునుండు ఇంద్రలోకంబునకేగి యింద్రుని యేనుంగగు నైరావతముంగొని తెచ్చి తల్లివ్రతమును నెరవేర్చెను. పూర్వము శచీదేవి యైరావతము నెక్కి కైలాసమునకుఁ బార్వతింజూడనేగి నప్పుడయ్యేనుంగును గౌరి చూచి నాకట్టి తెల్లయేనుంగు కావలయునని యీశ్వరుంగోర నపుడు గజముఖునొక్క మత్తేభముగానొనర్చి యొసంగినదాని నెక్కి మహానందముంబొందిన కారణమున దేవతలెల్లరు నీవ్రత మాచరించి తమ కోరికలను నెఱవేర్చుకొనిరి.

లకు న్యాయమయిన ప్రతాపము. ఒప్పన్ = విలసిల్లునట్లుగా, దేవతాగజమును = ఇంద్రుని యేనుఁగగు నైరావతమును, తెచ్చి = తీసికొనివచ్చి, తల్లివ్రతకార్యము = మాతయొక్క వ్రతపుఁబనిని, తీర్పఁడు + ఎ = జరగించిన, వాఁడు కాఁడా? (నెఱవేర్చెనుట.)

తా. మహాబలవంతుఁడగు నర్జునుఁడు కుంతీదేవి కుండుటచేత నే యింద్రుని యేనుఁగును గొనివచ్చి తల్లివ్రతమును నెఱవేర్చినట్లే ప్రపంచమున బల్లిమలగు కుమారులఁగాంచిన వారికెట్టి ఘనకార్యములైన నెఱవేరును.

ఉ. భూనుతులైన దేవతలు ♦ పూర్వముకొందఱువావివర్తనల్
మానిచరింపరోయనుచు ♦ మానవులట్లుచరింపఁబోలదం, భో
నిధులన్నియుందనద ♦ పుక్కిటబట్టెనగస్త్యుఁడంచునా, పూ
నికకెవ్వఁడోపునది ♦ పూర్వమహత్త్వముసుమ్ముభాస్కరా.

టీ. భాస్కరా! భూనుతులు = భూమియందలి జనులచేనుతింపఁబడు దేవతలు, కొందఱు = కొంతమంది, పూర్వము = వెనుక, వావి = వరుసయు

---

77 అగస్త్యుఁడు = ఇతఁడొక మహర్షి. మిత్రావరుణులు సముద్రపు గట్టున సంచరించుచుండి యూర్వశినిఁ జూచి కామింప వారికి వీర్యములు స్ఖలితములై ఘటమున నుంచఁబడఁగా నం దగస్త్యవసిష్ఠులు పుట్టిరి. ఇతనియాశ్రమము వింధ్యపర్వతసమీపమున. ఈతని కథలు చాలఁగలవు. వాతాపియను రాక్షసుని మాంసమును దిని జీర్ణము చేసికొనెను. ఇల్వలుని కోపముచే భస్మము చేసెను. పిల్లలకుగ్గుపెట్టిన తర్వాత తల్లులు వాతాపిజీర్ణమని యనుట యిందువలననే కలిగినది. మేరు వింధ్యపర్వతముల కొకనిమిత్తమున వివాదము కలిగి వింధ్యపర్వతము సూర్య చంద్రగతుల కడ్డమైనపుడు తన కమండలముయొక్క భారముచే దాని నణఁచి తాను దక్షిణదిక్కున భూమి యొరుగకుండ నిలిచెను. అందుచేతనే లోకములో, అగస్త్యుఁడొకయెత్తు అతని కమండలమొకయెత్తునను వదంతికలిగినది. మఱియుఁ గాలకేయుల నిమిత్తము సముద్రజలమును ఆపోశనముగఁ దీసికొనెను.



వర్తనల్ = గౌరవములను, మాని = వదలి, చరింపరు + ఓ = సంచరింపలేదా? అనుచున్ = అని వచించుచు, మానవులు = మనుష్యులు, అట్లు + ఆ = ఆదేవతలవలె, చరింపఁగన్ = తిరుగుటకు పోలదు = సరికాదు (తగదు) ఎట్లనఁగా:— అగస్త్యుఁడు, అంభోనిధులు అన్నియున్ = సముద్రములనన్నింటిని, తనదుపుక్కిటను = తననోటియందు, పట్టెను + అంచున్ = పెట్టుకొనెనని (ఉంచెనని) ఆపూనికకున్ = ఆ (యగస్త్యమహాముని) ప్రయత్నమునకు, ఎవ్వఁడు = ఏమనుష్యుఁడు, ఓపున్ = తగును? (సమర్థుఁడగును) సమర్థుఁడు కాఁడనుట, అది = అప్రయత్నము చేయుట. పూర్వమహత్త్వము సుమ్ము = పూర్వులయొక్క గొప్పతనము సుమా?

తా. పూర్వము కొంతమంది దేవతలు చెడ్డమార్గముల సంచరించిరి గదాయని మనుష్యులు గూడ చెడ్డపనులు చేయఁగూడదు. అగస్త్యమహాముని సముద్రము లన్నింటిలోని జలమును బుక్కిటఁబట్టినట్లు మనుష్యులెవరైన బట్టుటకు సాహసింపఁగలరా?

ఉ. భూపతి కాత్మబుద్ధి మదిఁ ♦ బుట్టనిచోటఁ బ్రధానులెంత ప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁ గొన ♦ సాగదు కార్యము, కార్యదక్షులై
యోపిన ద్రోణభీష్మ కృ ♦ పయోధు లనేకులు గూడి గౌరవ
క్ష్మాపతి కార్యమేమయినఁ ♦ జాలిరె చేయఁగ వారు భాస్కరా.

టీ. భాస్కరా! భూపతికిన్ = పుడమి ఱేనికి (ప్రభువునకు) ఆత్మబుద్ధి = నిజమైనబుద్ధి, మదిన్ = చిత్తమునందు, పుట్టనిచోటన్ = కలుగకున్నయెడ, ప్రధానులు = సచివులు (మంత్రులు) ఎంతప్రజ్ఞాపరిపూర్ణులు = ఎంతగొప్పబుద్ధితో నిండినవారు, ఐనన్ = అయినను, కార్యము = పని, కొనసాగదు = కాదు (నెఱవేఱదు) ఎట్లనఁగా:— కార్యదక్షులయి = పనులు నెఱవేర్చుటయందు సమర్థులయి, ఓపిన = తగియున్న, ద్రోణ = ద్రోణాచార్యులు, భీష్మ = భీష్మాచార్యులు, కృప = కృపాచార్యులు, (మున్నగాఁగల) యోధులు = బల

వంతులు, అనేకులు=చాలమంది, కౌరవక్ష్మాపతికార్యము=దుర్యోధనునిపని చేయఁగన్=నెరవేర్చుటకు, చాలిరి + ఏ=తగిరా ! (అనఁగాఁ గార్యముసానుకూలము సేయలేకపోయిరనుట)

తా. ఎంతమాత్రమును గార్యాలోచనములేని దుర్యోధనుని పనినితామొనర్చుటకుసమర్థులయ్యును భీష్మాదివీరులెవ్వరుఁజేయఁజాలనియట్లే రాజునకు నిజమైన యాలోచన పుట్టనప్పుడు మంత్రు లెంత తెలివిగలవారైనను కార్యమును అనుకూలపరుపఁజాలరు.

ఉ. భూరిబలాఢ్యుఁడైనఁ దల ♦ పోయక విక్రమశక్తిచేనహం
కారమునొందుటల్ తగవుగా♦దతఁడొక్కెడ మోసపోవుఁగా
వీరవరేణ్యుఁడర్జునుఁడు♦వింటికి నే నధికుండ నంచుఁ దా
నూరకవింటినెక్కిడఁగ♦నోపఁడుకృష్ణుఁడు లేమి భాస్కరా. 79

టీ. భాస్కరా ! తలపోయక = విచారింపక; భూరిబలాఢ్యుఁడు = ఎక్కువబలవంతుఁడు, ఐనన్=అయినప్పటికిని, విక్రమశక్తిచేన్ =శౌర్యాధిక్యముచే,, అహంకారము=అంతయు నావలననేయగుచున్నదనుగర్వమును,ఒందుటల్=చెందుటలు, తగవుగాదు=మంచిదిగాదు, అతఁడు=ఆ బలవంతుఁడు, ఒక్క + ఎడన్=ఒక్కచోట, మోసపోవుగా=అపాయమును గాంచుచుండునుగదా ! (ఎట్టులనఁగా) వీరవరేణ్యుఁడు=బలవంతులలో శ్రేష్ఠుఁడగు, అర్జునుఁడు, వింటికిన్ = చాపమునకు (ధనుస్సునకు) నేన్=నేను, అధికుండన్ + అంచున్=ఎక్కువనేర్పరినైనవాఁడనుచు, (విలువిద్యయందు మేటినంచు) కృష్ణుఁడులేమిన్=శ్రీకృష్ణమూర్తిలేకుండుటచే, ఊరక=మిన్నక, వింటిన్=ధనుస్సును, ఎక్కు + ఇడఁగన్=ఎక్కుపెట్టుటకయిన, ఓపఁడు=సమర్థుఁడుకాఁడు (తగఁడు)

తా. పాండవులమధ్యముండగు నర్జునుఁడుప్రపంచమునఁ దాను గొప్ప ధనుర్విద్యాపారంగతుఁడనని గర్వము జెందుచు శ్రీకృష్ణుఁడు నిర్యాణమును



జెందిన పిదప ధనుస్సు నెక్కుపెట్టుటకు సమర్థుఁడుకానట్లే మనుష్యుఁడు తానెంత బల్లిదుఁడైనను, నేనే యందఱికన్న గొప్ప సత్త్వ కలవాఁడనని గర్వపడరాదు. అట్టి బలవంతుఁడు కూడ నొకానొక వేళయందు అపాయమును గాంచును.

ఉ. భ్రష్టున కర్థవంతు లగు ♦ బాంధవులెందఱుగల్గినన్ నిజా
దృష్టము లేదుగావున ద♦రిద్రతఁ బాపఁగలేరు, సత్కృపా
దృష్టిని నిల్పి లోకుల క ♦ తిస్థిరసంపద లిచ్చులక్ష్మి యా
జెష్టకదేటికింగలుగఁ ♦ జేయదుతోడనెపుట్టిభాస్కరా. 80

టీ. భ్రష్టునకున్=కొరకానివానికి (ఎందుకు నక్కఱకు రానివానికి) అర్థవంతులు=ధనికులు, అగు బాంధవుల్=అయినట్టి చుట్టములు, కల్గినన్ = ఉన్నప్పటికిని, నిజాదృష్టము = తన భాగ్యము, లేదు కావునన్=లేఁడుకాబట్టి, దరిద్రతన్=(వాని) పేదఱికము, పాపఁగలేరు=నశింపఁ జేయఁజాలరు (పోఁగొట్టజాలరు) ఎట్లనఁగా:—సత్ + కృపాదృష్టిని=చక్కని కరుణతోఁ గూడిన చూపును, నిల్పి = ఉంచి, లోకులన్ = మనుష్యులకు, అతి=చాల, స్థిర=శాశ్వతమైన, సంపదలు = భాగ్యములు, ఇచ్చు లక్ష్మి = ఒసఁగునట్టి శ్రీదేవి, తోడనె=జెష్టతోఁగూడనె, పుట్టి = ఉదయించి (జన్మించి, అనఁగా జెష్టకు చెల్లెలనుట) జెష్టకున్ = దరిద్రదేవతకు (పెద్దమ్మకు) అదేటికిన్ = అది యేకారణమున, కలుగఁజేయదు = ఈయదు (భాగ్యములననుట)

తా, మహాలక్ష్మి కరుణాయుక్తములగు దృష్టులను ప్రజలపైనిల్పి మిక్కిలి భాగ్యముల నొసంగుచుఁ దన తోఁడఁబుట్టువగు దరిద్రదేవతకుసంపదల నీయలేకున్నట్లే పనికిమాలినవానికి భాగ్యవంతులగు చుట్టము లెందఱున్నను వాని దరిద్రమును బాపఁజాలరు.

చ. మదిఁదనునాసపడ్డయెడ♦మంచిగుణోన్నతుఁడట్టిహీనునిన్
వదలఁడు మేలుపట్టునన ♦ వశ్యమునున్నగనాదరించుఁగా

త్రిదశవిమానమధ్యమునఁ దెచ్చి కృపామతిసారమేయమున్
మొదలనిడండె ధర్మజుఁడు మూఁగిసురావళి చూడ భాస్కరా

**టీ.** భాస్కరా! మంచి గుణోన్నతుఁడు = చక్కని గుణములచే నధికుఁడైనవాఁడు. తన్నున్ = తన్ను గూర్చి, మదిన్ = చిత్తమునందు, (హృదయమున) ఆసపడ్డయెడన్ = ఆశించినప్పుడు. ఎట్టి హీనునిన్ = ఎటువంటిహీనునినైనను, వదలఁడు = విడిచి పెట్టఁడు, మేలుపట్టునన్ = మంచిసమయమున, అవశ్యము = తప్పక, మున్నుగన్ = ముందుగా, ఆదరించున్ + కా = దయఁజూచునుగదా! (ఎట్లనఁగా:—) ధర్మరాజు, కృపామతిన్ = కరుణతోఁగూడిన బుద్ధిచేత, సారమేయమున్ = శునకమును, (కుక్కను) తెచ్చి = తీసికొని వచ్చి, సురావళి = దేవతాసంఘము, మూఁగి = పరివేష్టించి (చుట్టుకొని) చూడన్ = కాంచుచుండఁగా, త్రిదశవిమానమధ్యమునన్ = దేవవిమానమునందు, మొదలన్ = ముందు, ఇడండు + ఎ = కూర్చుండఁబెట్టలేదా! (కూర్చుండఁ బెట్టెననుట)

**తా.** తన్ను వెంబడించి యాదినుండియు వచ్చుచుండిన శునకమును ధర్మరాజు సురలచ్చెరువునందుచుండ దేవతావిమానమునందుఁ గూర్చుండఁ బెట్టినట్లే మంచిగుణముగలవాఁడు, ఎంతనీచుండైనను దన్నాశ్రయించిన వానిని విడువక సమయము వచ్చినపుడు ముందాతని గౌరవించును.

---

81. పరీక్షిన్మహారాజునకుఁ బట్టము గట్టి ధర్మరాజు సోదరభార్యాసహితుండై ఘోరవనంబులఁ గొంతదూరమేగిన పిమ్మట భీమార్జున నకులసహదేవులును ద్రౌపదియుఁ గ్రమముగాఁ బ్రాణములను వీడి పరలోకగాములైరి. ధర్మరాజు మొదటినుండియుఁ దన్ను వెంటాడివచ్చుచుండ సోదరభార్యామరణములకుఁ జింతింపక మఱికొంతదూరమేగునప్పటికి, అతని కెదురుగా దేవతలువిమానమును గొనితెచ్చియందు ధర్మరాజు నధిష్ఠింపుమని వేడుకొననాడినుండియుఁ దన్ను వెంబడించుచు వచ్చుచున్న శునకమునుముందుగానందుగూర్చుండఁబెట్టుకొనెను. దేవసంఘముదాని కాశ్చర్యమొందిరి.



ఉ. మాటలకోర్వఁజాలఁ డభిమానసమగ్రుఁడు ప్రాణహానియౌ
చోటులనైనఁ దానెదురు చూచుచునుండుఁ గొలంకులోపల
న్నీట మునింగినప్పు డతినీచము లాడిన రాజరాజు పో
రాట మొనర్చి నేలఁబడఁ డాయెనె భీమునిచేత భాస్కరా.

**టీ.** భాస్కరా! అభిమానసమగ్రుఁడు = ఎక్కువ యభిమానముగలవాఁడు, ప్రాణహాని = జీవములకుపద్రవము, ఔ చోటులనైనన్ = అగునట్టి తావులయందయినను, తాను = యభిమానముగలవాఁడు, ఎదురు చూచుచునుండున్ = నిరీక్షించుచుండునుగాని, మాటలకున్ = (ఇతరులు పలికెడి) పలుకులకు, ఓర్వఁజాలఁడు = సహింపనేరఁడు, రాజరాజు = దుర్యోధనుఁడు, కొలంకులోపలన్ = సరస్సునందు (మడుగులో) నీట మునింగినప్పుడు = జలమున మునింగినప్పుడు, అతి = మిక్కిలి, నీచములాడినన్ = (పాండవులు) హీనవాక్యములాడఁగా, పోరాటము = సంగరము (యుద్ధము) ఒనర్చి = చేసి, భీమునిచేత = భీముఁడనువానిచేత, నేలన్ = పుడమియందు, (భూమియందు) పడఁడాయెనె = పడలేదా? (మృతినొందినాడనుట.)

**తా.** కౌరవులకును బాండవులకును యుద్ధమయినతరువాత శత్రుభయముచే దుర్యోధనుఁడు, ఒక మడుగున జలస్తంభనవిద్యచే డాగుకొనియుండి పాండవుల నీచవచనములకుసహింపక యుద్ధముచేసి భీమునిగదచేఁ దొడలు విఱిగిచచ్చినట్లే యభిమానముగలవాఁడు ప్రాణములనైన వదలును గాని యితరుల దూషణలను సహింపఁజాలఁడు.

---

82. దుర్యోధనుఁడు శత్రుభయమున నొక మడుగులో జలస్తంభనవిద్యచేడాగియుండియు ధర్మరాజాదులు పలికిన యుల్లిపట్టిమాటలకుడికి మడుగునుండి బయటికివచ్చి పాండవయోధులతో ఘోరసంగ్రామముఁ గావించెను. కాని సత్వహీనుఁడగుటచే భీముని గదచే తొడ విఱుగఁ గొట్టఁబడి మృతినొందెను.

ఉ. మానవనాథుఁ డాత్మరిపు • మర్మమెఱింగినవాని నేలినం
గాని జయింపలేఁ డరులఁ • గార్ముకదక్షుఁడు రామభద్రుఁడా
దానవనాయకున్ గెలువఁ • దా నెటులోపుఁ దదీయనాభికా
స్థానసుధన్విభీషణుఁడు • తార్కొని చెప్పక యున్న భాస్కరా.

టీ. భాస్కరా! మానవనాథుఁడు = నృపాలుఁడు (రాజు) ఆత్మరిపుమర్మమున్ = నిజవిరోధియొక్క రహస్యమును, ఎఱింగినవానిని = గుర్తెఱిఁగినవానిని (తెలిసికొనినవానిని) అరులన్ = విరోధులను (శత్రువులను) జయింపలేఁడు = చంపనేరఁడు (ఎట్లనఁగా:-) విభీషణుఁడు = రావణాసురుని తమ్ముఁడు, తార్కొని = (రాముని) జేరి, తదీయ = ఆరావణ సంబంధమయిన, నాభికాస్థాన = బొడ్డునందున్న, సుధన్ = అమృతవిషయమును, చెప్పక యున్నన్ = చెప్పఁడేని, కార్ముకదక్షుఁడు = ధనుర్విద్యయందు నేర్పరియైన రామభద్రుఁడు = శ్రీరాముఁడు, తాను, ఆదానవనాయకున్ = ఆరాక్షసరాజైన రావణాసురుని, గెలువఁగన్ = జయించుటకు, ఎటులు + ఓపున్ = ఎట్లు సమర్థుఁడగును? (సమర్థుఁడు కాఁడనుట.)

తా. తన యన్నయగు రావణాసురుని నాభిస్థానమున నమృతముకలదని విభీషణుఁడు శ్రీరామునకుఁ దెలియపరుపక యున్న నాతం డెంత ధనుర్విద్యాప్రవీణుఁడైనను రావణుని సంహరింపఁ జాలక యుండునట్లే ప్రభువునకు విరోధి మర్మ మెఱిఁగిన బంటు లేనిచో నా రాజు పగవారిని జయింపఁ జాలఁడు.

---

83. రామరావణయుద్ధమున రాముఁడు రావణుని శిరస్సులు ద్రుంచుచుండ మరల మొలచుచుండుటచే రామునికి రావణుని బంపుటకు శక్యము గాని సమయమున విభీషణుఁడు రావణుని నాభిస్థానమున నమృతమున్నదనియు దానినింకింపఁ జేయకున్న నాతఁడు మృతినొందఁడని చెప్పఁగా రాముఁ డాగ్నేయాస్త్రమున నాతని నాభిస్థానముననున్న యమృతమును ఇంకునట్టు చేసి పిమ్మట వాని తలలనరికి చంపెను.



ఉ. మానవుఁ డాత్మకిష్టముగ • మంచిప్రయోజనమాచరించుచో
గానక యల్పుఁ డొక్కఁ డది • గాదని పల్కినవానిపల్కుకై
మానఁగఁ జూడఁ డాపని స • మంచితభోజనవేళ నీఁగ కా
లూనినవంటకంబు దిన • కుండఁగ నేర్పగునోటు భాస్కరా. 84

టీ. భాస్కరా! మానవుఁడు = మర్త్యుఁడు (మనుజుఁడు) ఆత్మకున్ = చిత్తమునకు (హృదయమునకు) ఇష్టము = ప్రియము (హితము) అగు మంచిప్రయోజనము = అయినట్టి మంచిపనిని, ఆచరించుచోన్ = ఒనరించు వేళయందు, అల్పుఁడు = తక్కువవాఁడు (హీనుఁడు) ఒకఁడు, కానక = ఆపనివలని ఫలము దెలిసికొనక. అది = ఆపని. కాదని = ఒనరింపఁగూడదని, పల్కినన్ = వచించినచో (చెప్పినచో) వానిపల్కుకై = ఆతని వచనముల నిమిత్తము, ఆపని = ఆప్రయోజనమును, మానఁగన్ = వదలుటకు, చూడఁడు = ఎంచఁడు, ఎట్లనఁగా:- సమంచిత = చక్కని (మంచి) భోజనవేళన్ = భుజించు సమమున, ఈఁగ కాల్లు + ఊనిన = మక్షికము కాలుమోపిన (వ్రాలిన) వంటకంబు = భోజన పదార్థమును, తినకుండఁగన్ = భక్షించుటను వదలుట, నేర్పు + అగునోటు = నేర్పరితనమగునా (కాదనుట)

తా. మనుజుఁడన్నము దినునప్పుడా యన్నముపై నీఁగ వ్రాలినందున మానక భుజించునట్లే మనుష్యుఁడు తనకుహితమైనపని నొనర్చుచున్నప్పుడు అల్పుఁడొకఁ డేతెంచి వద్దని చెప్పినను ఆపనిని విడువక యాచరించును.

ఉ. మానిని చెప్పినట్లెఱుక • మాలినవాఁ డటు చేసినన్ మహా
హాని ఘటించు నేఘనునకై • న నసంశయముర్విపైఁ గృపా
హీనతబల్కినన్ దశర • థేశ్వరుఁ డంగనమాటకై గుణాం
భోనిధి రాము బాసిచని • పోవఁడె శోకముతోడ భాస్కరా. 85

టీ. భాస్కరా! ఎఱుకమాలినవాఁడు = జ్ఞాన హీనుఁడగువాఁడు, మానిని = (తన) భార్య, ఎట్లు చెప్పును = ఏవిధముగా వచించునో, అట్లు చేసి

నన్=ఆవిధముగా నొనరించినయెడల, ఊర్వీపైన్=పుడమియందు (భూమియందు) ఏఘనునికైనను=ఎంతటి గొప్పవానికయినను, మహాహాని=పెద్దయాపత్తు, (గొప్పవిపత్తు) ఘటించున్=తగులుకొనును (సమకూడును) అసంశయము=సందేహములేదు. (ఎట్లనఁగా:—) కృపాహీనతన్=దయలేకపోవుటచే, పలికినన్=శ్రీరాముని వనమునకుఁ బంపి తన కొడుకునకు రాజ్యమీయవలయునని వచింపఁగా, అంగనమాటకై=భార్య యగు కైకేయి పలుకునిమిత్తము, దశరథ + ఈశ్వరుఁడు=దశరథమహారాజు, గుణాంబోనిధిన్=సద్గుణములకు సముద్రముం బోలినవాఁడగు, రామున్=రాముని, పాసి=విడిచిపెట్టుకొని (వదలి) శోకముతోడన్=దుఃఖముచే, చనిపోఁడె=మృతినొందలేదా! (అనఁగా జచ్చెననుట.)

తా. తన సతి యగు కైకయాడిన మాటలను దశరథుఁడు బాగుగ నాలోచింపక యామె యిచ్చవచ్చినట్లు, మంచి గుణములుగలరామచంద్రుని వనమునకుఁబంపి యాతని వియోగమును సహింపనివాఁడై ప్రాణములను విడిచినట్లే జ్ఞానహీనుఁడు తన భార్య చెప్పినరీతి సంచరించినచోఁ దానెంతటి ఘనుఁడయినను, పెద్ద విపత్తులలో మున్గి చెడిపోవును.

చ. మునుపొనరించుపాతకమ♦మోఘముజీవులకెల్లఁ బూనియా
వెనుకటిజన్మమం దనుభ♦వింపక తీఱదు; రాఘవుండు వా
లిని బడవేసి తామగుడ ♦ లీలయదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున♦వీడ్కొనఁడేతనమేను భాస్కరా. 86

టీ. భాస్కరా! మునుపు = వెనుక (పూర్వము) ఒనరించుపాతకము=కొంచిన దుష్కృతము (చేసినపాపము) అమోఘము=వ్యర్థముకాదు, జీవులకున్ + ఎల్లన్=సమస్తప్రాణికోటులకు, పూని=వహించి (యత్నించి) ఆవెనుకటిజన్మమందున్=తఱువాత జన్మమున, అనుభవింపక=(తనపాపఫలమును) జెందక, తీరదు = వీలుకాదు (కనుపడదు) అనుభవింపకదీరదనుట. ఎట్లనఁగా:—రాఘవుండు=రాముఁడు, వాలిని=వాలియను వానరప్రభు



వును, పడన్ + ఏసి = మృతినొందించి (చంపి) తాన్=తాను (రామచంద్రుఁడు) మగుడన్ = తిరిగి, లీలన్=విలాసముగా, యదూద్భవుఁడు + ఐ= యదుకులమునజన్మించిన వాఁడయి [కృష్ణావతారమును బూని] కిరాతుచేన్ = బోయవానిచేత, వి = మిక్కిలి (విశేషము) నిశిత = వాడియైన, బాణ = సాయకము యొక్క (అమ్ముయొక్క) పాతమునన్=దెబ్బచే, తన మేను = తన యొడలు (తన శరీరము) వీడ్కొనఁడు + ఎ = విడలలేదా? (మృతినొందెననుట)

తా. వాలిని రామచంద్రుఁడు చంపినపాపముచే సంభవించిన ఫలమును గృష్ణుఁడై యవతరించి యొకబోయవాని! వ్రేటున శరీరమును విడచిపెట్టి యనుభవించినట్లే యెట్టి మహాత్ముఁడయిన వెనుకటి జన్మమందొనర్చిన దుష్కృతమును తిరిగి జన్మమును బొంది యనుభవించి తీరును.

ఉ. రాకొమరుల్ రసజ్ఞునిఁ ది♦రంబుగమన్ననునుంచినట్లు భూ
లోకమునందుమూఢుఁదమ♦లోపలనుంపరు; నిక్కమేకదా!
చేకొనిముద్దుగాఁ జదువు♦చిల్కను బెంతురుగాక పెంతురే
కాకమునెవ్వరైన శుభ♦కారణసన్ముని సేవ్యభాస్కరా. 80

టీ. శుభకారణ=మంగళముల నొసంగుటకు మూలమయిన వాఁడా! సత్ + మునిసేవ్య=మంచి మునీశ్వరులచేఁ బూజింపఁబడువాఁడా! రాకొమరున్= రాజపుత్రులు, మన్ననన్=గౌరవముతో, తిరంబుగన్ =స్థిరముగా

86. వాలి = సుగ్రీవునియన్న, అంగదుని తండ్రి, ఇతని భార్య తార తండ్రి ఋక్షవిరజుఁడు, మహాబలశాలి, గౌతముని భార్యయైన యహల్యయందు, ఇంద్రసూర్యసంపర్కమున బుట్టిన పుత్రులను గౌతముఁడు తన మాఁతువలనఁ దెలిసికొని కోఁతులుగాఁ దన కుమారులను శపించినట్లును అందు పెద్దవాఁడు వాలియయ్యెనని చెప్పుదురు. ఈవాలి తమ్ముఁడగు సుగ్రీవుని దరిమివైచినందున నావైరము మనంబున నిడుకొని రాముఁడు సీతాన్వేషణమునకై బయలుదేరినపుడు రామునిచే నన్నయగువాలిని జంపించెను.

(నిలుకడగా) రసజ్ఞునిన్ = రసము తెలిసినవానిని, ఉంచినట్లు = పెట్టుకొనినట్లు, భూలోకమునందున్ = పుడమిలో, మూఢు = బాలిశుని (మూర్ఖుని) తమలోపలన్ = తమ నగరులో, ఉంపరు = పెట్టుకొనరు, నిక్కము + ఐ + కదా = సత్యమేకదా! (ఎట్లనఁగా.) ఎవ్వరైనన్ = ఎవ్వరైనను (ఎట్టివారయిన) చేకొని = చేతిపైఁ బెట్టుకొని, ముద్దుగన్ = ముదముతో (ముచ్చటగాననుట) చదువు = పఠించుచున్న (పద్యమును చదువుచున్నయనుట) చిలుకను = శుకమును, పెంతురుగాని = పోషింతురుగాని, కాకమున్ = వాయసమును (కాకిని) పెంతురా = పెంచెదరా? (పెంచరనుట.)

తా. ప్రపంచమున మనుష్యులు ముచ్చటదీరఁ బద్యములను జదువుచున్న చిలుకను బెంచెదరుగాని కాకిని బెంచకుండునట్లే నృపాలురు రసికులగు వారిం జేర్తురుగాని మూఢులను జేరఁదీయరు.

ఉ. లోకములోన దుర్జనుల ♦ లోతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినం గవయఁ ♦ జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోటఁ గుమి ♦ గూడి యసహ్యపుఁ గూఁతలార్చుచుం
గాకులు తన్నవే తఱిమి ♦ కాయము తల్లడమంద భాస్కరా

టీ. భాస్కరా! లోకములోనన్ = ప్రపంచమందు, సుశ్లోకుఁడు = మంచి యశస్సుగలవాఁడు, దుర్జనులలోఁతును = ఖలుల యూహను (దుష్టుల యభిప్రాయమును) ఎఱుంగక = తెలియక, చేరరాదు = (వారికడకు) పోఁగూడదు, చేరినన్ = ఒక వేళ వెళ్ళిన యెడల, కవయన్ = కలియబడుటకు, చూతురు = ఊహింతురు. ఎక్కసక్కెముల్ = వేళాకోళపు మాటలను (కోడిగపుపలుకులను) చేయుదురు = ఆడుదురు. (వచింతురు) ఎట్లనగా కాకులు, కోకిలన్ = కోవెలను (కోయిలను) కన్నచోటన్ = కాంచినతావునందు, గుమిగూడి = గుంపయి, అసహ్యపు గూఁతలు = పాడుకూఁతలను అర్చుచున్ = కూయుచు, కాయము = (దాని) యొడలు, (శరీరము) తల్ల



డము + అందన్ = తొట్రుపడునట్లుగా, తఱిమి = వెన్నాడి (వెంబడించి) తన్నవే = తాడనము సేయునా? (అనఁగా దన్ననుట.)

తా. ప్రపంచమునందు సజ్జనుఁడు దుర్మార్గుల యూహను దెలియఁజాలకుండ వారిం జేరరాదు. అట్టి వారిని గూడిన యెడలఁ గాకములు కోకిలం గాంచినతఱి చుట్టునుజేరి కేకలు పెట్టుచు వెంబడించి దాడనము సేయునట్లే దుర్మార్గులు మంచివానిని జుట్టుకొని యపహసింతురు.

ఉ. లోను దృఢంబుగాని పెను ♦ లోభి నినమ్మి యసాధ్యకార్యముల్
కానక పూనునేనతఁడు ♦ గ్రక్కునఁ గూలును నోటిపుట్టిపై
మానవుఁ డెక్కి పోవ నొక ♦ మాటు బుటుక్కున ముంపకుండునే
తానొక లోఁతునం గెడసి ♦ దానిఁ దరింపఁగలేక భాస్కరా. 89

టీ. భాస్కరా! లోను = డెందము (హృదయము) దృఢంబుగాని = గట్టిదికాని, పెనులోభిని = మిక్కిలి పెద్దయాశగలవానిని, నమ్మి = విశ్వసించి అసాధ్య = సాధింప శక్యము గాని, కార్యముల్ = కర్జములను (పనులను) కానక = తెలిసికొనక (ఎఱుంగక) పూను నేని = యత్నపడునేని, అతఁడు = ఆ మనుష్యుడు, గ్రక్కునన్ = వెంటనే, కూలున్ = నాశనమందును, (ఎట్లనఁగా:—) మానవుఁడు = మర్త్యుఁడు (మనుజుఁడు) ఓటిపుట్టిపైన్ = ప్రాఁతదై చిల్లులు పడిన పడవమీఁద, ఎక్కి = అధిరోహించి. పోవన్ = పోఁగా (వెళ్ళఁగా) తాను = ఆ పుట్టి (ఆ పడవ) ఒక లోఁతునన్ = ఒక గభీరమగు ప్రవాహములో, కెడసి = పడి, దానిన్ = ఆ ప్రవాహమును (వరదను) తరిం

89. పుట్టి = మానవిశేషము; (నాలుగువేఁదుముల కొలఁది) ప్రేముబెత్తములతోఁ బెద్దగంపవలె నల్లి మీఁదఁ దోలుకప్పి కుట్టబడిన యేఱుదాఁటెడు సాధనము (వాని పుట్టిమునిఁగెను. వాని పుట్టిముంచెను, ఇట్టి తావులయందు వాఁడెక్కిన పుట్టిమునిఁగెను. వాఁడెక్కిన పుట్టిముంచెను. అని శబ్దార్థము. వాఁడు మునిఁగెను. అని తాత్పర్యార్థము, అప్పుడు మునుగుటకును, ముంచుటకును చెడుటయు, చెఱుచుటయు నర్థము.)

పట్ + కన్ లేక = దాఁటలేక, ఒకమాటు=ఒక పర్యాయము, బుటుక్కునన్=బుటుక్కుమని, ముంపక + ఉండును + ఏ=దానిపైనున్న మనుష్యుని ముంపకుండునా (అనఁగా ముంచివేయుననుట.)

తా. ప్రాఁతగిలిన పడవమీఁద మనుజుఁడెక్కి మిక్కిలి గభీరమగు నొక నీటివెల్లువను దాఁటుటకు యత్నించెనేని, ఆపడవ యాజలప్రవాహమున వానిని వెంటనే ముంచివేయునట్లే మానవుఁడు గట్టిదయిన మనస్సులేని లోభిని నమ్మి యొక ఘనకార్యమునకుఁ బూనుకొనినచో వాని మూలమునఁ దప్పక చెడిపోవును.

ఉ. వంచనయింత లేక యెటు♦వంటిమహాత్ములనాశ్రయించినం
గొంచెమెకాని మేలు సమ♦కూడదదృష్టము లేనివారికిన్,
సంచిత బుద్ధిబ్రహ్మనని♦శంబును వీఁపున మోఁచునట్టి రా
యంచకుఁదమ్మితూండ్లుదిన♦నాయెఁగదా ఫలమేమి భాస్కరా.

టీ. భాస్కరా! వంచన=కపటము, ఇంతలేక=ఇంచుకయైనను లేకుండఁగా, ఎటువంటి మహాత్ములన్=ఎంతటిఘనులను (ఎంతగొప్పవారిని) ఆశ్రయించిన=భక్తితోఁ జేరియుండినను, అదృష్టములేనివారికిన్ = భాగ్యహీనులకు, కొంచెమెకాని=అల్పమేకాని, మేలు=మంచి (శుభము) సమకూడదు=కాదు (సంభవింపదు) ఎట్లనఁగా:—సంచితబుద్ధిన్=పూర్వజన్మమున సంపాదించిన జ్ఞానముచేత, అనిశంబును=ఎప్పుడును (నిత్యమును) వీఁపునన్=వెన్నుచేత, బ్రహ్మను=విధాతను, మోచునట్టి= మోయుచున్న (వహించుచున్న) రాయంచకున్=రాజహంసకు, తమ్మితూండ్లు=తామరకాడలను, తిననాయెఁగదా=మెక్కుటయే కలిగెనుగదా! ఫలము = లాభము, (అనఁగా బ్రహ్మను వెన్నుననిడి మోయుచున్నందున కనుట.) ఏమి=ఏమియున్నది? (ఫలములేదనుట.)

90. బ్రహ్మ=త్రిమూర్తులలో మొదటివాఁడు. తొల్లి కల్పావసానమున నమస్తము జలార్ణవమయి యంతట నంధకార బంధురముగ నుండు వేళ నాజలమధ్యమున శ్రీమన్నారాయణమూర్తి వటపత్రశాయియై యోగనిద్ర దేలుచుండి వరాహరూపము నొంది తనదంష్ట్రాగ్రమున భూమిని జలమునందుండి పైకెత్తి నిలుపఁగా నితఁడాపంకజోదరుఁడగు నారాయణుని గర్భమునఁ బ్రవేశించి యందుండు బ్రహ్మాండముల తత్త్వము నెఱిఁగి యాదేవుని నాభికమలమునందుండి వెడలివచ్చి జగత్సృష్టి నొనర్ప నారంభించెను. కనుక నితనికిఁ బంకజభవుఁడు, అను నామము కలిగెను. ఇతఁడు చతుర్ముఖుఁడు. తొలుత నితని కైదు ముఖములుండెడివి. ఈశ్వరునకు బ్రహ్మకు నైదేసి ముఖము లుండుటచేఁ బార్వతి శివుఁడనుకొని యొక సమయమున బ్రహ్మయొద్దకుఁ బోవుటంగాంచి బ్రహ్మశిరస్సు నొకదాని నీశ్వరుఁడు ఖండించెను. అంత బ్రహ్మయలిగి శివుడు కాపాలికత్వమును జెంది భిక్షాటనము జేయునట్లు శివుని శపించెను. బ్రహ్మయవయవములనుండి పెక్కుమంది పుట్టిరి. తన దేహమునుండి పుట్టిన సరస్వత్తింజూచి కామాతురుఁడై భార్యగాఁ జేసికొనెను. ఈ పద్యమునఁ గవి "బ్రహ్మననిశంబును వీఁపున మోఁచునట్టి రాయంచకుఁ దమ్మితూండ్లు దిననాయెఁగదా ఫలమేమి భాస్కరా!" అని ప్రయోగించెను. బ్రహ్మకు వాహనముగా నుండు రాయంచకు తమ్మితూండ్లే దినుసుగాని బ్రహ్మను మోచినందున లాభమేమియు లేదని వ్రాయుట చాలతప్పు. త్రిమూర్తులలో నొకఁడును ప్రపంచసృష్టికి అధారముగా నున్నవాఁడు స్వయంభువునగు బ్రహ్మను మోచినందున నా యంచ కెట్టిగౌరవము నుత్తమలోకములు కలవో వేఱ చెప్పవలయునా! ఆయంచకుఁ దూండ్లు తినవలసిన గతియే యుండకుండ వచ్చును. అమృతమే పానముచేయుచుండవచ్చును. లేదా కామధేనువు పాలు కావలసియున్నను మహా గౌరవముతో నింద్రుఁడు పంపుచుండవచ్చును. ఇది కొంచెము హాస్యాస్పదముగాఁ గాన్పించును. కవి యభిప్రాయము ఇక్కడ నీతిని దెల్పుచు దానినుపమానముమాత్రమే వాడినట్లు కాన్పించును. ఇది యిట్లుండ రాయంచను సంచితబుద్ధి పూర్వజన్మమువలన, గలిగిన బుద్ధి వాసనగలదని కూడ వ్రాసియున్నాఁడు. ఈ జన్మమున బ్రహ్మను మోయుటను సంపాదించుకొనుటచే ముందెంత లాభముండునోగదా!

తా. ప్రపంచమును సృష్టించెడు బ్రహ్మదేవుని నిత్యమును దనవీఁపున నిడుకొని మోయుచుండు రాయంచ తమజాతి పక్షులవలెఁ దమ్మితూండ్లనే యాహారముగాఁ జేసికొని యున్నట్లు భాగ్యహీనుఁ డెంతటి యదృష్టవంతుని జేరియున్నను వాని కెక్కుడు లాభములేదు.

ఉ. పట్టుచుఁదండ్రి యత్యధమ♦వర్తనుఁడైననుగాని వానికిం
బుట్టిన పుత్త్రకుండు తన♦పుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ;
నెట్టనమఱ్ఱివిత్తు మును♦పెంతయుఁగొంచెముదానఁబుట్టునా
చెట్టుమహోన్నతత్వమును♦జెందదెశాఖలనిండి భాస్కరా.

టీ. భాస్కరా! తండ్రి = జనకుండు, పట్టుచున్ = కృశించుచు, (శుష్కించుచు) అతి=మిగుల (మిక్కిలి) అధమవర్తనుఁడు=హీనవర్తనకల వాఁడు (నీచవర్తనము గలవాఁడు) ఐనను + కాని=అయినను, వానికిన్=, అట్టి తండ్రికి, పుట్టిన పుత్త్రుఁడు=జన్మించినకొడుకు, తన పుణ్యవశంబునన్= తనయొక్క పూర్వము జేసికొనిన సుకృతవాసనచేత, దొడ్డధన్యుఁడు=పెద్ద కృతార్థుఁడు. ఔన్=కాఁగలడు (అగును) ఎట్టు + అనన్=ఏరీతననఁగా, మఱ్ఱివిత్తు=వటబీజము, మునుపు=ఆదిని, (అనఁగా నేలఁ బాతునప్పుడనుట) ఎంతయున్=మిగుల. కొంచెము=సూక్ష్మమయినది, (చిన్నది) దానన్ = ఆగింజయందు, పుట్టునాచెట్టు= మొలచునా (మఱ్ఱి) చెట్టు, శాఖలన్=స్కంధములచేత (కొమ్మలచేత) నిండి = ఆవరింపఁబడి, మహోన్నతత్వమును = మిగుల పొడవును, చెందదు + ఎ=వహింపదా ? (చెందుననుట.)

తా. వటబీజము చిన్నదైనను దానినుండి మొలచునది పెద్ద వృక్షమగునట్లే తండ్రి యల్పుఁడైనను వాని కుమారుఁడు తన పుణ్యముచే గొప్ప వాఁడగును.

చ. వలనుగఁగానలందు♦ బ్రతి ♦ వర్షమునంబులి నాలుగైదుపి
ల్లలఁగనుదూడనొక్కటి ని♦లంగనుధేనువు రెండు మూఁడు



నేఁ, డుల కటులైనఁ బెబ్బులి ♦ కుటుంబములల్పములాయె
నాలమం, దలుగడువృద్ధిఁజెందవెయ♦ధర్మముధర్మముదెల్ప
భాస్కరా. 92

టీ. భాస్కరా! వలనుగన్ = చక్కఁగా, కానలందున్ = వనములయందు (అడవులలో) పులి = వ్యాఘ్రము, ప్రతివర్షమునన్ = ఏఁటనేఁటను (ఏఁటేఁటను) నాలుగైదు పిల్లలన్ = నాలుగేసి, అయిదేసి పిల్లలను, కనున్= ప్రసవించును, ధేనువు=గోవు (ఆవు) రెండుమూఁడు నేఁడులకున్= రెండేసి మూఁడేసి సంవత్సరములకు, దూడనొక్కటిన్ = ఒక్క లేగను (ఒక్క వత్సమును) మాత్రమే = అంతే, కనున్ = ప్రసవించుచున్నది. (ఈనుచున్నది.) అటులైనన్=అలాగైనను. అధర్మమున్=పులుల యధర్మమును (అన్యాయమును) ధర్మమున్ = గోవుల ధర్మమును (న్యాయమును) తెల్పన్=తెలియఁబరచుటకు, బెబ్బులి కుటుంబములు=పెద్దపులుల సంతాన, వృద్ధి. అల్పములు + ఆయెను=తక్కువయయ్యెను, ఆలమందలు=గోవులమందలు (పశుసమూహము) కడున్=ఎక్కువ (మిక్కిలి) వృద్ధిన్ + చెందవు =ఎ + అభివృద్ధి నొందవలేదా ? (వృద్ధియగుచున్నదనుట)

తా. అధర్మప్రవృత్తిగల పులులు ప్రతిసంవత్సరము నాలుగైదు పిల్లలను బెట్టినను వృద్ధిలో లేవు. ధర్మప్రవృత్తిగల గోవులు రెండు మూఁడేండ్లకొక్క దూడ నీనినను వృద్ధియందున్నట్లే ధర్మాధర్మప్రవర్తనగల వారి వంశములు వృద్ధిక్షీణముల నందుచుండును.

చ. వలవదు క్రూరసంగతి య♦వశ్యమొకప్పుడు సేయ బడ్డచోఁ
గొలఁదియెకాక యెక్కువలు♦గూడవు;తమ్ములపాకులోపలం
గలసిన సున్నమించుకయ♦కాకమఱించుక యెక్కువైనచో
నలుగడఁజుఱ్ఱుచుఱ్ఱుమని♦నాలుకపొక్కకయున్నె? భాస్కరా.

టీ. భాస్కరా! క్రూరసంగతి = దుష్టసాంగత్యము (చెడ్డవారితోఁ స్నేహము) అవశ్యము = తప్పక (ముఖ్యముగా) వలవదు=తగదు (మానవల

యును) ఒకప్పుడు=ఒకవేళ, చేయఁబడ్డ లోకన్ = అస్నేహము చేయఁబడిన యెడల, కొలఁదియె కాని = ఇంచుకయె కాని, ఎక్కువలు = మిక్కిలిగా నొనర్చుటలు, కూడవు = తగవు: ఎట్లనఁగా:— తమ్ములపాకులోపలన్ = నాగవల్లీ దళముల యందు, కలసిన సున్నము = కూడిన సున్నము, (అనఁగా రాచిన సున్నమనుట) ఇంచుకయ కాక = తక్కువయినఁగాని, మరించుక =నించుకఁగొంచెము, ఎక్కువైనచోన్ =ఘనమయిన యెడల (అధికమైనచో) నలుగడన్ = నాలుగువైపుల, చుఱ్ఱుచుఱ్ఱు మనఁ (ఇది పొక్కుటకు కరణము) నాలుక = జిహ్వ, పొక్క-క + ఉన్నె = పొక్కకుండునా ? (అనఁగాఁ బొబ్బలు లేచుననుట)

తా. చెడ్డవారి స్నేహ మాచరింపవలెను. ఒక సందర్భమునఁ జేయుట తటస్థించినను తగినకొద్దిపాటి స్నేహము నే చేయవలయును. అధికమయినయెడల దమలపాకునం దెక్కువ సున్నము నిడినయెడ నాలుక పొక్కి బాధపెట్టునట్లు అనేక అపాయములు సంభవించును.

ఉ. వానికి విద్యచేత సిరివచ్చెనటంచును విద్య నేర్వఁగాఁ
బూనినఁ బూనుఁగాక తన♦పుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁడోపు, సరి♦పోఁ జెవి పెంచుకొనుఁగా కదృష్టహీనుఁడు కర్ణభూషణము♦లెట్లుగడింపఁగనోపు? భాస్కరా.

టీ. భాస్కరా! వానికిన్ =ఆ పురుషునకు, విద్యచేతన్ = చదువు వలన, సిరి=భాగ్యము (సంపద) వచ్చెన్ + అటంచున్ =కలిగినదని (సంభవించెనని, విద్యన్=చదువును. నేర్వన్ + కాన్=నేర్చుటకు, (అభ్యసమొనర్చుటకు) పూనినన్ + పూను + కాక=వహించిన వహించుఁగాక, (యత్నమొనర్చిన నొనర్చుఁగాక) తన పుణ్యము = తన పూర్వజన్మసుకృతము, చాలక=సరిపడకున్నచో, భాగ్యరేఖకున్ = అదృష్టపుగీతనిమిత్తము, పూనఁగన్=యత్నించుటకు, ఎవ్వఁడు=ఏమానవుఁడు, ఓపున్=తగును ? (సమర్థుఁడగును) అనఁగాఁగాడనుట, సరిపో=మంచిదే కాని (సరియే కాని) అదృష్ట



హీనుఁడు=సంపద లేనివాఁడు, చెవి పెంచుకొనుఁగాక=కర్ణము యొక్క (కన్నము) పెద్దదిచేసికొనును గాని, కర్ణభూషణముల్ = చెవికుండలములను (అనగా కర్ణాభరణములనుట) గడింపఁగన్=సంపాదించుటకు, ఎట్లు + ఓపున్ =ఏవిధముగాఁ దగును (తగఁడనుట)

తా. అదృష్టహీనుఁడగు వాఁడు కర్ణము కన్నమును పెంచి నంతెంచఁగలఁడుగాని చెవికిఁ గుండలములను దెచ్చుకొన సమర్థుండు కాన ట్లే విద్యచే నొకని కైశ్వర్యము కలిగినదని తాను యత్నముచేసి విద్యను సంపాదింప గలఁడు గాని పూర్వజన్మమునఁ జేసికొనిన సుకృతము లేకుండ భాగ్యమును దెచ్చుకొనఁ జాలఁడు.

ఉ. సంతతపుణ్యశాలి నొక♦జాడను సంపద వాసిపోయి తా
నంతటఁ బోక నెట్టుకొని♦యప్పటి యట్లు వసించియుండు; మా
సాంతమునందుఁ జందురుని♦సన్నికళల్ పెడఁబాసిపోయినం
గ్రాంతి వహింపఁడో? తిరు♦గంబడి దేహమునిండ భాస్కరా.

టీ. భాస్కరా! సంపద=భాగ్యము. సంతత=మిక్కిలి యెక్కువయిన (మిగుల విశాలమయిన) పుణ్యశాలిన్=సుకృతముచే నెసఁగువానిని. ఒకజాడను=ఒక రీతిగా; వాసిపోయి=వదలిపోయి, తాన్=ఆ సంపద, (ఆ భాగ్యము) అంతటన్ + పోక=అంతమాత్రమున విడువక, నెట్టుకొని = త్రొక్కుకొని (పొదుకొని) అప్పటియట్ల=పూర్వరీతినే (మొదటివలెనే) వసించియుండున్=వాసముచేసి యుండును, ఎట్లనఁగా:— మాస + అంతమునందున్=నెలచివర (అమావాస్యనాడు) చందురున్=చంద్రుని, (చందమామను) అన్నికళల్=కళలెల్ల (పదునారుకళలనుట) పెడఁబాసిపోయినన్= వదలిపోయినను, తిరుగంబడి= వెండియు (మరల) దేహము=శరీరము(అనఁగా

95. ఓటు=ప్రశ్నార్థము, వహింపఁడోటు=పొందఁడా ! జిహ్వ గాదోటు=అగ్నియేకదా ! అను మొదలగునవి యుదాహరణము.

బింబమనుట) నిండన్=పూర్ణమగునట్లుగా, కాంతిన్=ప్రకాశమును, వహింపఁడు + ఓటు=చెందఁడా ! (అనఁగాఁ బొందుననుట )

తా. చంద్రకళలన్నియు నమావాస్యనాఁడు వదలిపోయినను దనకళలను దినదినము దేవతలకిచ్చునట్టి సుకృతముచే (అనఁగా) చంద్రకిరణము లమృతమయములు, (దేవతలమృతపానము చంద్రకిరణముల మూలమునఁ గావింతురని భావము) మరలఁ గ్రమముగాఁ గళలను బూర్ణముగాఁ గాంచుచున్నట్లు అనుదినము సుకృతములను జేయువాని నొక విధముగా నైశ్వర్యము వదలియున్నను దత్పుణ్యకారణమునఁ దిరుగ నాయైశ్వర్యములం గాంచఁగలుగును.

చ. సకలజనప్రియత్వము ని ♦ జంబుగఁగల్గిన పుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైనఁ దడ ♦ వుండదు వేగమె పాసిపోవుఁగా;
యకలుషమూర్తియైన యమృ ♦ తాంశుఁడు రాహువు తన్ను
మ్రింగినం, దకటకమాని యుండఁడె ? దృ ♦ ఢస్థితి నెప్పటి
యట్ల భాస్కరా.

---

96. రాహువు=ఈతఁడొక రాక్షసుఁడు. ఇతని తల్లిపేరు సింహిక సింహికకుమారుఁడు గావున సైంహికేయుఁడను పేరుఁ గాంచెను. మహావిష్ణువు జగన్మోహనావతారమున దేవతలను రాక్షసులను నమృతమును బంచిపెట్టు సమయమున నీరాహువు దేవతారూపమునుధరించి దేవతలపంక్తిలోఁ గూర్చుండఁగా నది కనిపెట్టి సూర్యచంద్రులు విష్ణువునకు సంజ్ఞచేయఁగాఁ జక్రాయుధమున నమృతపానము సేయుతరుణమున రెండుతునియలుగా ఖండించెను. అమృతస్పర్శచే నారెండు తుండెములును అమరత్వముంగాంచి సూర్యచంద్రులయందలి వైరముచే నారెండు ముక్కలును ఒకటి రాహువు, ఒకటి కేతువు, అను నామములతో గ్రహములయి అప్పుడప్పుడు రాహువు చంద్రుని, కేతువు సూర్యునిగబళించుచుందురు. దానికేచంద్రగ్రహణమనియు, సూర్యగ్రహణము నని పేరులు కలిగెను: గ్రహణమనఁగా గ్రహించుట, కబళించుట, పట్టుకొనుట యని యర్థము.



టీ. భాస్కరా ! సకలజనప్రియత్వము = సర్వమానవప్రేమకుఁ దగినవాఁడై యుండుట, నిజంబుగన్=సత్యముగా, (నిశ్చయముగా) కల్గిన = కలయట్టి, పుణ్యశాలికిన్=సుకృతముచేసెసఁగువానికి, ఒకొక్కయెడన్= ఒకానొక సమయమందు, ఆపద=కష్టము, (కీడు) ఐనన్ = సంభవించినను (కలిగినను) తడవు ఉండదు=చాలకాలముండదు, వేగమున + ఎ = త్వరగానే (వెంటనే) పాసిపోవున్ = నాశనముఁ జెందును, ఎట్టులనఁగా:— అకలుష = నిర్మలమయిన, మూర్తి = ఆకారముగలవాఁడు (బింబముగలవాఁడు) ఐన + అమృత + అంశుఁడు=అయినట్టి అమృతకిరణుఁడు (చంద్రుఁడు) తన్నున్=తన్ను, రాహువు = రాహువను పేరుగల గ్రహము, మ్రింగన్=కబళించినను, టకటక=ఆ తొట్రుపాటును, మాని = వదలి (విడిచి) దృఢస్థితిన్=స్థిరమైన యునికిచేతను, ఎప్పటియట్ల = యథాప్రకారము (పూర్వరీతినే) ఉండఁడు + ఎ = నివసింపఁడా ! (అనఁగా నుండుననుట.)

తా. నిర్మలుండగు చంద్రుఁడు రాహుగ్రహముచే గబళింపఁబడి ప్రకాశహీనుఁడయినను, అల్పకాలములోనే మరలఁ బూర్వకాంతినిబొందుచున్నట్లే సకల జనులకు నిష్టుఁడుగానుండిన సుకృతవంతునకొకప్పుడు చిక్కులచే సౌఖ్యము లేకపోయినను, అతఁడు వెంటనే యట్టి కష్టములనుండి విముక్తుఁడై వెనుకటివలెనే సౌఖ్యపడును.

ఉ. సన్నుత కార్యదక్షుఁడొక ♦ చాయనిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు ♦ నొండొక మేలొనరించు సత్త్వసం
పన్నుఁడు భీముఁడా ద్విజుల ♦ ప్రాణము కావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని ♦ నేపునరూపఁడగించి భాస్కరా. 97

టీ. భాస్కరా! సన్నుత = పొగడఁబడుచున్న, కార్య=పనియందు, (కర్జమందు) దక్షుఁడు=తగినవాఁడు, ఒకచాయన్ = ఒక ప్రక్క, నిజ ప్రభ = స్వకీయకాంతి (తనకాంతి) అప్రకాశము + ఐ=బయలుపడనిదై,

ఉన్నప్పుడు + ఐనన్ = ఉండినకాలమందైనను, లోకులకున్ = ప్రజలకు, ఒండొకమేలు = ఒకానొకమంచి (ఒకానొక యుపకారము ఒనరించున్ = కావించుచుండును. (చేయుచుండును.) ఎట్లులనఁగా:— సత్త్వసంపన్నుఁడు = బలశాలిగానున్న (సత్తువగలిగియున్న) భీముఁడు = పాండురాజు కుమారుఁడైన భీముఁడనువాఁడు. ఏకచక్రమందున్ = ఏకచక్రమను పేరుగల పురమందు, ఎన్నికగాన్ = ప్రఖ్యాతిగా (వెల్లడిగా) బకాసురున్ = బకుఁడనెడు దైత్యుని, ఏపునన్ = శౌర్యముచే, రూపు + అడఁగించి = స్వరూపనాశనమొనర్చి (అనఁగా జంపియనుట) ఆ ద్విజుల ప్రాణములు = ఆ విప్రుల జీవములను (ఆబ్రాహ్మణుల యసువులను) కావఁడు + ఏ = కాపాడలేదా! (రక్షించెననుట.)

తా. భీముఁడు పూర్వకాలమున నేకచక్రపురంబున విప్రవేషమున బిచ్చమెత్తుచుండినను అచ్చటివారి కెల్లరకి విరోధియగు ఒక రాక్షసునిజంపి బ్రాహ్మణుల ప్రాణములను గాపాడినట్లే ప్రపంచమున నేర్పరియగు వాఁడొక్క సమయమునఁ దాను ప్రకాశహీనుఁడైయున్నను మానవులకు మేలే యొనర్చుచుండును.

---

97. బకుఁడు = వీఁడు ఏకచక్రపురంబున నొక యగ్రహారమున సమీపమునందుండు నడవిలోఁ జేరి యా యగ్రహారమునందలి బ్రాహ్మణులను హింసించుచుండఁగా వారు (ఇలువరుసను = దినదినము) ఒక్కఁడొక్కఁడు, ఒక బండెడన్నమును, రెండు ఎనుబోఁతులనుకొనిపోయియా రాక్షసునికి ఆహారమగునట్లు ఒడంబడిక చేసికొని, ఆచొప్పున నడపుచుండిరి. అంత కొంతకాలమునకు పాండవులు దుర్యోధనునికపటోపాయంబుచేఁ గాల్పఁబడిన లక్కయింట చావు తప్పించుకొనిపోయి బ్రాహ్మణ వేషములతో నాయగ్రహారమున నొక బ్రాహ్మణునియింట నివసించిరి. ఆ కాలమునందు వీరుండెడు నింటి బ్రాహ్మణునివంతువచ్చెననియాబ్రాహ్మణుఁడు తనకుగలిగిన యిద్దఱు పసిబిడ్డలను తన భార్యను పంపనేరకయు, తాను పోవుటకును మనస్కరాకయుఁ జింతించుచుండఁగాఁ బాండవులతల్లియగుకుంతియాపుత్త్రాం



చ. సరసగుణప్రపూర్ణునకు ♦ సన్నపుదుర్గుణ మొక్కవేళయం
దొరసిననిట్లు నీకుఁదగు♦నో యని చెప్పిన మాననేర్చుఁగా
బురదయొకించుకంత తము ♦ బొందిన వేళలఁ జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున ♦ నుండవెనీరములెల్ల భాస్కరా.

టీ. సరసగుణప్రపూర్ణునకున్ = సద్గుణములచే నిండినవానికి, సన్నపుదుర్గుణము = చిన్నదుర్గుణము, ఒక్కవేళయందున్ = ఒకప్పుడు, ఒరసినన్ = ప్రాప్తమయినయెడల, (కలిగినచో) ఇట్లు నీకున్ తగున్ + ఓ = ఇట్లొనర్చుట నీకొప్పునా? అని చెప్పినన్ = అనిపలికినచో, మానన్ + నేర్చున్ + కా = మానివేయునుగదా! (విసర్జించునుగదా) బురదతాన్ = ఆబాడి (ఆపంకము), ఒకించుకంత = స్వల్పము (కొంచెము), తమున్ = తమ్ము, (ఆజలములను) పొందినవేళన్ = చెందినట్టి తరుణములయందు, చిల్లవిత్తు = ఇండుపుగింజ గంధమనుట) పైన్ = తమ మీఁద (అనఁగా నానీటిమీఁదననుట) ఒరసినన్ = తగిలినచో, నీరములు + ఎల్లన్ = ఉదకములన్నియు, నిర్మలత్వమునన్ = పరిశుభ్రతతో (కలుషములేక) ఉండవు + ఎ = ఉండవా! (నిర్మలముగా నుండుననుట.)

తా. ఉదకము లొక్కొక్క సమయమందు బురదగానున్న ఇండుపుగింజ గంధము దానిలోఁ బడిన నాబురదయంతయు విరిగి స్వచ్ఛముగాఁ నుండునట్లే సద్గుణవంతునకొక చెడుగుణమున్న నది యెవ్వరయినఁ జెప్పిన దానిని వదలఁగలఁడు.

---

తమువిని భీముని బంపినయెడల నారాక్షసుని జంపివచ్చును. అంతటితో బ్రాహ్మణులబాధ తీరునని యెంచి యాబ్రాహ్మణునితో నాకయిదుగురు కొడుకులుండిరిగదా! వారిలో నొకరిని బంపెదనని భీముని బంపెను. వాఁడు పోయి బకాసురుని జంపివచ్చెను. అంతట నాయగ్రహారమునందలి బ్రాహ్మణులందఱు సంతోషించి యతనిని బహువిధముల దీవించిరి.

వసుదేవుని తమ్ముఁడయిన కంసుని జ్యేష్ఠపుత్త్రుఁడు ఇంకొక బకాసురుఁడు. వీఁడు బృందావనమునందుఁ గృష్ణుఁడుండుతఱిని కంసుని పంపునఁ నచ్చటికివచ్చి బకరూపధారియై అతనిని మ్రింగఁబోయి యాతనిచేఁజంపబడెను.

చ. సరసదయాగుణంబుగల ♦ జాణమహిం గడునొచ్చియుండి
యుం దఱుచుగవానికాసపడి ♦ డాయఁగవత్తురులోకులెట్లనం
జెఱకురసంబుగానుఁగను ♦ జిప్పిలిపోయినమీఁదఁ బిప్పియై
ధరఁబడియున్నఁ జేరవె ము♦దంబునఁ జీమలు పెక్కు భాస్కరా.

టీ. భాస్కరా! సరసదయాగుణంబు=మంచితోఁ గూడిన కృపాస్వభావము. కలజాణ=ఉన్న పేరుపుగలవాఁడు, దాత, మహిన్ = పృథివియందు (భూమిలో) కడున్ =మిగుల, నొచ్చియుండియున్ =బాధతోనున్నను, (దరిద్రుఁడైననుట) తఱుచుగన్ = ఎక్కువగా, లోకులు= ప్రజలు (మనుష్యులు) వానికిన్=అట్టితేగకొని నిమిత్తము, ఆసపడి=ఆశపెట్టుకొని, డాయన్ + కన్=వత్తురు (చేరుదురు,) ఎట్లు + అనన్ = ఏరీతిననఁగా, గానుఁగన్=పరంజమువలన, చెఱకురసంబు=ఇక్షుదండముయొక్క నీరు, చిప్పిలిపోయినన్=కాఱిపోఁగా, మీఁదన్ = పిమ్మట (పిదప) పిప్పి + ఐ=రసహీనమైనదై, ధరన్ =నేలమీఁద, పడియున్నన్ =పడినను, పెక్కు-చీమలు = ఎన్నియో పిపీలికములు, ముదంబునన్ = ఆనందముతో (సంతోషముతో) చేరవు + ఎ = సమీపించి యుండవా? (అనఁగాఁ బట్టుననుట.)

తా. చెఱకు రసమంతయు గానుగచేఁ బిండబడిన వెనుక నా పిప్పి కడకే చీమలు ముదముతోఁ జేరుచున్నట్లే దాత దరిద్రుఁడైనను జనులాతని కడకే చేరుచుందురు.

ఉ. సారవివేకవర్తనల సన్నుతికెక్కిన వారిలోపలం
జేరినయంతమూఢులకుఁ ♦ జేపడ దానడ; యెట్లులన్నఁగా
సారములోన హంసముల ♦ సంగతినుండెడికొంగపిట్టకే
తీరునఁగల్గనేర్చునడ ♦ దీయగతుల్ దలపోయ భాస్కరా.

100 తీరు:—విధము, తెఱఁగు, తెన్ను, రీతి, చాయ, చొప్పు, రేఖ, విధి, అనువు, పోలిక, ఫక్కి, వడుపు, భంగి, మున్నగునవి సమానార్థములుగా నెఱుంగవలయును,



టీ. భాస్కరా! సార=సత్యమైన, వివేక = మంచిచెడ్డల వివరముగల, వర్తనలన్=నడకలచే, సన్నుతికిన్=ఖ్యాతికి (పొగడ్తకు) ఎక్కినవారిలోపలన్ =వచ్చినవారియందు, చేరినయంతన్=కూడినమాత్రముచే, మూఢులకున్=మంచిచెడ్డలు తెలియనివారికి, అజ్ఞానులకు అనడ = ఆ మంచినడవడి, చేపడదు=సంప్రాప్తము కాదు (దొఱకదు) ఎట్టులన్నన్ = అది యేరీతిననఁగా, కాసారములోనన్ = చెరువులో, సరస్సున, హంసముల సంగతిన్ = అంచలయొక్క మైత్రితో, ఉండెడి కొంగ పిట్టకున్=నివసించు బకమునకు, తదీయగతుల్ = ఆ హంసగమనములు, తలపోయన్ = విచారింపఁగా, ఆలోచింపఁగా, ఏతీరునన్=ఎట్లు, ఏ తెఱంగున, కల్గనేర్చును = లభించెడిది? కలుగవనుట.

తా. సరస్సున నంచలతోఁ గూడి నిత్యమును సంచరించుచుండినను కొంగలకా హంసల నడకలు రానట్లే ప్రపంచమున యోగ్య ప్రవర్తనచే విఖ్యాతిఁగన్న మనుజులతో నెన్నిదినములు సాంగత్యము చేసియున్నను వారి సత్ప్రవర్తనము మూర్ఖులగు జనులకు లభింపదు.

చ. స్థానము తప్పివచ్చునెడఁ ♦ దానెటువంటి బలాఢ్యుఁడున్ నిజ
స్థానికుఁడైన యల్పునిక ♦ తంబుననైనను మోసపోవుఁగా
కానలలోపలన్ వెడలి గంధగజం బొకనాఁడు నీటిలోఁ
గానకచొచ్చినన్ మొసలి♦కాటునలోఁబడదోటుభాస్కరా.

101. వెనుక గజేంద్రుఁడు ఒకప్పుడు స్త్రీగణంబులం బెక్కింటిని వెంటనిడుకొని వనవిహారము సేయుచు నొకకొలనిలోఁ దిగి దప్పిఁదీర్చుకొనుచుండ నొక మకరము (మొసలి) ఆగజేంద్రుని కాలుపట్టి గభీరజలంబులకు లాగుకొనిపోవునెడ బలవంతుఁడగు నా గజరాజు దాని నొడ్డున కీడ్చుచుండెను, ఈ విధముగా నీ నేనుంగుల ఱేఁడును మొసలుల ఱేఁడును వేయిసంవత్సరములు ఘోరముగఁ బోరిరి. అంతగజవల్లభునకు శక్తిచాలక భయముచే మహావిష్ణువును ప్రార్థించెను. వెంటనే కరి మొఱనాలించి శ్రీహరియే తెంచి

టీ. భాస్కరా! తాన్=తాను, ఎటువంటి బల + ఆఢ్యుఁడున్ = ఎంత శక్తిగలవాఁడైనను, స్థానమున్=తన తావును, తప్పి = కదలి, విడిచిపెట్టి, వచ్చునెడన్ = వచ్చునప్పుడు, నిజస్థానికుఁడు = తన తావున నున్నవాఁడు, వినయల్పునికతంబుననైనన్ = అయిన నీచునిచేతనైనను, మోసపోవును = హానిని జెందును, (ఎట్లనఁగా:—)గంధ=మదించిన, (గర్వముగల) గజంబు=ఏనుఁగు,(గజేంద్రుఁడు) ఒక నాఁడు=ఒకదినమందు,కొనలలోపలన్ = అరణ్యములలో నుండి (అడవుల నుండి) వెడలి = బయలుదేరి, కానక=వీక్షింపక, చూడక నీటిలో=ఉదకములో, జొచ్చినన్ = చొరఁగా, (ప్రవేశింపఁగా, దిగఁగా,) మొసలికొటునక్=నక్రముయొక్క నోటికఱపుచే, లోఁబడదోటు = లొంగినది కాదా.

తా. బలముగలవాఁడైనను గజేంద్రుఁడు తాను నివసించు నడవి వదలి జలమునదిగినంతమాత్రమున నొకయల్పజంతువగు మొసలికిఁజిక్కినట్లే ప్రపంచమున మనుష్యులు తామెంతటి శక్తిగలవారైనను తమ తావును వదలిపెట్టినపుడు స్వస్థానవాసియగు బలహీనునిచేతనే వంచింపఁబడుదురు.

---

తన సుదర్శన చక్రముచే నక్రమును ఖండించి గజేంద్రునకుఁ దన పదం బొసంగెను.

గంధము=వాసన, గంధకము, గర్వము, లేశము, సంబంధము అని యర్థములు. గజజాతులు మూఁడు 1 భద్రము, 2 మందము, 3 మృగము అని త్రివిధగజములకును మానభేదముచే అరాళము, అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామనము అని నామములు గలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, వాయుకము, పంచమంగళము అని గజభేదము లనేకములు గలవు. కాని, గంధగజేంద్రమనఁగా, గంధజాతి యేనుఁగని కాదు. అట్లు కొందఱి యభిప్రాయమగుటచే నిందుఁదెలియపఱచఁబడినది. "గంధగజయాన" ఇత్యాదు లెఱుంగునది.



చ. సిరిగలవానికెయ్యెడలఁ ♦ జేసిన మేలది నిష్ఫలంబగున్
నెఱిగుఱిగాదు పేదలకు ♦ నేర్పునఁ జేసిన సత్ఫలంబగున్
వఱపునవచ్చి మేఘుఁడొక ♦ వర్షము వాడిన చేలమీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ ♦ గుర్వఁగనేమిఫలంబు భాస్కరా.

టీ. భాస్కరా! సిరి=భాగ్యము, (సంపద) కలవానికిన్ = ఉన్నవానికి, ఏ + ఎడలన్=ఎట్టితరుణములయందును, మేలు = మంచి, ఉపకారము, చేసినన్ = ఒనర్చినయెడల, అది = ఆమంచి, నిష్ఫలంబు + అగున్ = వ్యర్థయగును, లాభములేకపోవును. నెఱి=నిండయిన, గుఱికాదు=గుఱుతు కాదు (లక్ష్యముండదనుట) పేదలకున్=దరిద్రులగువారికి, నేర్పునన్=నిపుణతతో (ఉపాయముచే) చేసినన్=(మంచి) యొనర్చినచో, సత్ఫలము = మంచి లాభముగలది, అగున్ = కాఁగలదు, (ఎట్టులనఁగా) మేఘుఁడు = జలదము, (మబ్బు) వఱపునన్ = వర్షములేని సమయమున, ఒక వర్షమున్= ఒక వానను, వాడినచేలమీఁదటన్=ఎండుచున్న సస్యములమీఁద, కురిసినన్ + కాక=వర్షించిననేకాని, అంబుధులన్=సముద్రములయందు, కుర్వఁగన్=వర్షింపఁగా, ఏమిఫలంబు=ఏమిప్రయోజనము కలదు ?( లాభ మెంత మాత్రమును లేదనుట)

తా. వర్షములులేక సస్యము లెండబాఱుచున్న సమయమున మబ్బు ఆసస్యములపై వర్షించిన లాభముండునుగాని సముద్రములలోఁ గురిసిన లాభములేనట్లే మనుష్యుఁడు దరిద్రులకుఁ జేసినమేలు ఫలమునిచ్చునుగాని ధనవంతునకుఁ జేసిన మేలు ఫలమునీయదు.

చ. సిరివలెనేని సింహగుహ ♦ చెంతవసించినఁజాలు సింహముల్
కరులవధింపఁగానచటఁ ♦ గల్గునుదంతచయంబుముత్యముల్

---

102. ఎడ, సమయము, తరుణము, పట్టు, తఱి, అజ్జ, అదను, ఇవి సమానార్థములు.

హారువుగ నక్కబొక్కకడ♦నాశ్రయమొందిన నేమిగల్గెడుం
గోరిసెలుదూడతోఁకలును♦గొమ్ములు నెమ్ములు గాక భాస్కరా.

టీ. భాస్కరా! సిరి=భాగ్యము, వలెనేని=కోరవలసినయెడల, సింహగుహా చెంతన్=సింహము వాసముచేయుచున్న కొండబిలమువద్దను, వసించినన్=నివాసము చేసినయెడల, చాలున్=తగును (ఏమన) సింహముల్=సింగములు (మృగరాజులు) కరులన్=గజములను,(ఏనుగులను)వధింపఁగాన్=చంపుచుండుటచే, దంతచయంబు = ఏనుఁగులయొక్క దంతముల గుంపు, ముత్యముల్=ఏనుఁగు కుంభములనుండి రాలినముత్తియములును, అచటన్ = అతావున, కల్గును=లభించును (దొరకును) ఎటులనఁగా:—హారువుగన్=బాగుగా, నక్కబొక్కకడన్=జంబుకముయొక్క నివాసస్థలమగు కన్నముకడ, ఆశ్రయము + అందినన్=కనిపెట్టుకొనియున్నచో, గోరిసలు=చచ్చినవాని డెక్కలును, దూడతోఁకలును=లేగలయొక్క పుచ్ఛములును, కొమ్ములు=మృతినొందిన జంతువులశృంగములును, ఎమ్ములు=శల్యములును (ఎముకలును) కాక=తప్ప. ఏమిగల్గెడున్=ఏమిదొరకును! (ఏమియు లభింపదనుట)

తా. భాగ్యమును గోరునట్టివారు, సింహముగుహాయొద్దఁ గనిపెట్టుకొనియున్న లాభముగాని నక్క కన్నముదగ్గఱఁ గనిపెట్టుకొనియున్నఁ బ్రయోజనమేమి ?

చ. సిరతరధర్మవర్తనఁ బ్ర♦సిద్ధికినెక్కినవాని నొక్కము
ష్కరుఁడతినీచ వాక్యములఁ♦గాదనిపల్కిననమ్మహాత్ముఁడుం
గొఱంతవహింపఁడయ్యెడ;న♦కుంఠితపూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁగాకి రెట్టయిడి♦నందుననేమికొఱంత భాస్కరా.

టీ. భాస్కరా! ఒక్కముష్కరుఁడు=ఒక మూఢుఁడు, సిరతర=మిక్కిలిస్థిరమైన, ధర్మవర్తనన్ = న్యాయవృత్తిచేత, ప్రసిద్ధికిన్ + ఎక్కి

104. సుధా=అమృతము, పాలు, సున్నము, జేముడు, చాఁగ ఇటుక అని యర్థములు.



నవానిన్=ఖ్యాతినొందినవానిని, అతినీచవాక్యములన్ = ఎక్కుడగు హీనపుఁబలుకులచే, కాదు అని=నిందించి, పల్కినన్= మాటలాడినను, అయ్యెడన్ = అట్లునిందించి పలుకునపుడు, అమ్మహాత్ముఁడున్ = అఘనుఁడును, కొఱంతన్=తక్కువను (లోపమును) వహింపఁడు=పూనఁడు, (చెందఁడు) ఎట్లనఁగా:—కాకి = వాయసము, అరుగుచున్ = మీఁద నెగిరిపోవుచు, అకుంఠిత = ఎక్కువ, పూర్ణ = నిండయిన, సుధాపయోధిలోన్ =అమృతసాగరమున, రెట్ట ఇడినందునన్ = మలము విడిచినంతమాత్రమున, (రెట్ట వేసినంతమాత్రమున) ఏమికొఱంత = ఆ యమృతసాగరమునకు తక్కువయేమి ? (లోపమేమియు లేదనుట.)

తా. అమృతసముద్రముమీఁదిభాగమున నాకాశమున నెగురుచుపోవు కాకి యా సముద్రమున రెట్టవేసిన నాసముద్రమునకు లోపమెంతమాత్రమును లేనట్లే ధర్మముచేఁ గీర్తినందిన మానవునొకనీచుఁడు నిందించినంత మాత్రమున నాతనికేలోపము గలుఁగదు.

చ. స్ఫురతరకీర్తిమంతులగు♦పుత్త్రులఁగాంచినఁ గాకమూఢము
ష్కరులఁగనంగఁ దేజములు గల్గవుగా; మణికీలితాంగుళా
భరణము లంగుళంబుల శు♦భస్థితిఁ బెట్టినఁగాక గాజుటుం
గరములు పెట్టినందున వి♦కాసముగల్గునటయ్య? భాస్కరా.

టీ. భాస్కరా ! స్ఫురతర = అధిక ప్రకాశముగా నున్న, కీర్తిమంతులు = యశస్సుగలవారు (ప్రఖ్యాతిగలవారు) అగు పుత్రులన్ = అయినట్టి కొడుకులను, కాంచినన్ + కాక = కనినయెడల. లాభమున్నదిగాని, మూఢ=అజ్ఞానులగు, ముష్కరులన్ = మూఢులను, కనంగన్ = కాంచినట్టయిన, తేజములు = ప్రతిభలు. ప్రతిష్ఠలు. కల్గవుగా = కలుగనేరవు కదా ! ఎట్లనఁగా:— మణి = రత్నములచే, కీలిత = కూర్పఁబడిన, అంగుళాభరణములు=ఉంగరములు (అంగుళీయకములు) అంగుళంబులన్=వ్రేళ్ళయందు, శుభస్థితిన్ =మంగళయుక్తముగా, పెట్టినన్ + కాని=

ఉంచిననేగాక, (ధరించిననేతప్ప) గాజుటుంగరములు=కాచముచే నొనర్చిన యుంగరములు, పెట్టినందునన్ =వ్రేళ్ళయందు ధరించినందువలన (తాల్చుటచే) వికాసము=వెలుఁగు, కలుగునటయ్యా = సంభవించునా? ప్రకాశము నొందదనుట.

తా. కరాంగుళులయందు రత్ననిర్మితములగు నంగుళీయకములు దాల్చిన హస్తమున కందము కలుగునుగాని గాజుటుంగరములను బెట్టుకొనిన కాంతిగలుఁగనట్లే యశోవంతులగు సుతులంబడసిన ఖ్యాతివచ్చును గాని మూర్ఖులగు పుత్రులం గాంచినఁ గీర్తిరాదు.

ఉ. నేనగవాంఛితాన్నము భు♦జింపఁ గలప్పుడు, కాక లేనిచో
మేనులుడస్సియుంట నిజ♦మేకద దేహులకగ్నిహోత్రుఁడౌ
నేనిజభోజ్యముల్ గుడుచు♦నేనియుఁబుష్టివహించు లేని నా
డూనివిభూతిలో నడఁగి♦యుండఁడె తేజముతప్పి భాస్కరా.

టీ. భాస్కరా! నేనగన్ = ఎక్కువుగా, వాంఛిత + అన్నము = హితమైనయోగిరమును, భుజింపఁ గలప్పుడు=తినునట్టి వేళయందు, కాక= తప్ప, లేనిచోన్=అట్టి భోజనపదార్థము లేనియెడల. దేహులకున్=ప్రాణికోటికి, మేనులు = ఒడళ్ళు, శరీరములు, డస్సి=అలసటఁజెంది, ఉండుట= ఉంట, నిజము + ఏ + కద = సత్యమేకదా! ఎట్లనఁగా:—అగ్నిహోత్రుఁడు + ఔన్ + ఏనిన్=వీతిహోత్రుఁడయినప్పటికిని, నిజ భోజ్యముల్ = తాను దినఁదగిన యాహారద్రవ్యములు, కుడుచునేనియున్ = భుజించినయెడల, పుష్టి = బలమును, వహించున్=కాంచును, చెందును, లేని నాఁడు= అట్టి భోజనపదార్థము లేని తఱి, తేజమున్ = ప్రకాశమును, కాంతిని, తప్పి=వదలి, విడిచి, ఊని=వహించి, విభూతిలోన్ = బూడిదలో, అణఁగి యుండఁడు + ఎ=డాగియుండలేదా? (అనఁగా బూదియందు దాగియుండెననుట)

100. విభూతి=బూడిద, ఐశ్వర్యము.



తా. అగ్నిహోత్రుఁడెక్కుడు తేజశ్శాలియైనను, తనకు హితపదార్థములు భక్షింప దొరకినప్పుడు బలముతో, బ్రకాశముగలవాఁడైయుండును. ఆయాహారములేనితఱి భస్మమున మునిఁగియుండునట్లే మనుజుఁడు తనకు హితమైన పదార్థములు తినలభించినపుడు శరీర కాంతితో నుండి యాభోజనము దొరుకనితఱి మిక్కిలి చిక్కియుండును.

ఉ. హాళి నిజప్రబుద్ధి తిర♦మైనవిధంబునఁ బెట్టుబుద్ధు లా
వేళల కంతెకాని మఱి♦వెన్కకునిల్వవు; హేమకాంతియె
న్నాళులకుండుఁగాని యొక♦నాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళుకయుండునే యినుప♦తాటకుఁజాయలు పోక భాస్కరా.

టీ. భాస్కరా! హాళిన్ = కోరికచేత, నిజప్రబుద్ధి = స్వతస్సిద్ధముగాఁ గలిగిన జ్ఞానము, తిరము=స్థిరముగానుండునది, ఐనవిధఁబునన్= అగునట్టు, పెట్టుబుద్ధులు = ఒనర్చిన తెలువులు, (ఒకరు నేర్పినబుద్ధులనుట) ఆవేళలకున్=ఆదినపర్యంతమేస్థిరమైయుండునుఅంతెకాని=అంతియుదక్క, మఱివెన్కకున్=తరువాత నచ్చు కాలమునకు, నిల్వవు = స్థిరపడవు. (నిలచియుండవు) ఎట్లనగా:—హేమకాంతి=సువర్ణప్రకాశము.(బంగారుకాంతి) ఎన్నాళులకున్ = ఎన్నిదినములకైన, ఉండునుగాని = నిలుచునుగాని, ఒకనాఁడు=ఒక దినమంతయు, పదంపడి=మరల, సానఁబట్టినన్ = శాణమున సంఘర్షణము చేసినయెడల, ఇనుపతాటకున్=ఇనుపపట్టకు, చాయలు=కాంతులు, పోక=నాశనమునొందక, తాళుకయుండునే స్థిరమైయుండునా? (నిలిచియుండదనుట.)

తా. స్వతస్సిద్ధ సంభవమయిన జ్ఞానము బంగరు కాంతివలెను నిలుకడగా నుండుంగాని, ఇతరులు చెప్పినందునఁ గలిగిన జ్ఞానము సానబట్టిన యినుపరేకు తళుకువలెఁ నాదినముమాత్రమేయుండి నాశనమొందును.

107. తాళుకయుండునే యనునది వ్యాకరణ విరుద్ధము. "తాలిమినుండునే" యని యుండిన స్థిరమైయుండునా యను నర్థమునకు సన్నిహితమైయుండును.

ఉ. హీనకులంబునందు జని ♦ యించినవారికి సద్గుణంబు లె
న్నేని యొనంగఁ గల్గి యున్న నొక ♦ నేరము చెందకపోదు పద్మముల్
భూనుతిఁ గాంచియున్ బురదఁ బుట్టుటవల్ల సుధాకరోదయం
బైన నసహ్యమొందవె ప్రియం ♦ బునఁ జూడఁగలేక భాస్కరా.

టీ. భాస్కరా! హీనకులంబునందున్=తక్కువవంశమందు, జనియించినవారికిన్=జన్మించినవారికి (పుట్టినవారికి) సద్గుణంబులు=మంచిగుణంబులు (యోగ్యస్వభావమనుట) ఎన్నేని ఉన్నన్ + కల్గినన్=ఎన్నికలిగి యున్నను, ఒక నేరము=ఒకతప్పు, చెందకపోదు=కలుగకపోదు (కలుగుననుట) ఎట్లనఁగా:—పద్మములు=కమలములు (తమ్మిపూవులు) భూనుతిన్=ధరణియందలి, (ప్రజలయొక్క) పొగడికను, కాంచియున్=పొందియున్నను, బురదన్=పంకమునందు (అడుసున) పుట్టుటవల్లన్=జన్మించుటచేతను (దురితముచే) సుధాకర + ఉదయంబు + ఐనన్=చంద్రుఁడు పుట్టినప్పుడు (ఉదయమైనప్పుడనుట) ప్రియంబునన్=ఇష్టముతో (కోర్కెతో) చూడఁగలేక=కాంచజాలక, అసహ్యము + ఒందవు + ఎ = ఏహ్యమును గాంచవా? (అనఁగా నసహ్యముగ నుండుననుట.)

తా. ప్రపంచమునందు తామర పూవులు మిక్కిలి ఖ్యాతినొందినను పంకమునందు జన్మించిన కతనఁ గలిగిన దురితముచేతనే చంద్రోదయమయిన తతి నసహ్యముగఁ గాంచుచుండును గాని ప్రేమను జూడనట్లే యల్పవంశమున జన్మించిన మనుజుఁడెన్ని మంచిగుణములు గలవాఁడైనప్పటికిని నేదియో యొక హీనగుణముగూడఁ ముఖ్యముగాఁ జెందియుండును.

ఉ. ఇంచుక నేర్పుచాలక విహీనతఁ జెందిన నాకవిత్వమున్
మించువహించె నీకతన ♦ మిక్కిలి యెట్లనఁ దోలుబొమ్మలన్
మంచి వివేకి వాని తెర ♦ మాటుననుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల ♦ డెందము నింపవె ప్రీతి భాస్కరా.



టీ. భాస్కరా! ఇంచుక=తక్కువ (స్వల్పము) నేర్పు=నిపుణత (చతురత) చాలక=లేక, విహీనతన్=నీచత్వమును (చులకదనమును) చెందిన=వహించినట్టి, నాకవిత్వమున్=నాకవనముగూడ, నీకతనన్=నీమూలమున, (అనఁగా నీదయచే ననుట) మిక్కిలి=మిగుల (ఎక్కువగా) మించువహించెన్=ప్రతిభతోఁ గూడినదయ్యెను (అనఁగాఁ బ్రఖ్యాతివహించెననుట.) ఎట్టులనఁగా:—మంచి వివేకి = చక్కని జ్ఞానముగలవాఁడు, తోలుబొమ్మలన్=చర్మవిగ్రహములను, వాని తెరమాటునన్ = వానియొక్క జవనికచాటున, ఉండ=నివసించి, ప్రశస్తరీతిన్=మిక్కిలి మంచి పద్ధతిని, ఆడించినన్ = నాట్యముచేయించినయెడల (అనఁగా నృత్యముతోఁ గూడినవానినిగాఁ గడపిన యెడల ననుట) ఆడవే=నృత్యము సేయవా? (ఆడుననుట.) ప్రీతిన్=ప్రేమచే (సంతోషముచే ననుట) జనుల డెందము=ప్రజలయొక్క చిత్తమును, నింపవు + ఎ=పూరించవా? (అనఁగా నిందించుచున్నవనుట.)

తా. జ్ఞానవంతుఁడు తెరచాటున డాగి నిపుణతతోఁ దోలుబొమ్మల నాడింపనవి ప్రజలనానందమునఁ ముంచునట్లుగా నాడుచున్నట్లే నీదయవలన రసవంతమెంతమాత్రమును గాని నాకవిత్వము సకల మానవులకు హృదయంగమమై విరాజిల్లుచుండునా! (ఓ సూర్యభగవానుడా! నీ వెట్లాడించిన నట్లాడితినే గాని నేనెంతయు స్వతంత్రుఁడను గావని యీ చివరపద్యమునఁ దనయిష్టదేవుని భక్తిపూర్వకముగా నుతించి శతకరచనమును విరమించెను.)

టీకా తాత్పర్య సహితమగు

భా స్క ర శ త క ము

సంపూర్ణము.

---

రామా ముద్రాక్షరశాల, పవరుపేట-ఏలూరు.

## శతకములు.

| బాలబాలికల కుపయోగించునవి. | | | అ. | ప. |
|---|---|---|---|---|
| సుమతీశతకము మూలము | | ... | 1 | 0 |
| డిటో | టీకాతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| కృష్ణశతకము మూలము | | ... | 1 | 0 |
| డిటో | సటీక | అప్పృవుడు 19_4_27 | 3 | 0 |
| దాశరథీశతకము మూలము | | ... | 1 | 0 |
| డిటో | సటీక | అప్పృవుడు 11_5_26 | 4 | 0 |
| భాస్కరశతకము మూలము | | ... | 1 | 0 |
| డిటో | టీక | డిటో 11_5_26 | 4 | 0 |
| గజేంద్రమోక్షము మూలము అప్పృవుడు | | | 2 | 0 |
| డిటో | టీకాతాత్పర్యముతో | 11_5_20 | 6 | 0 |
| డిటో | క్యాలికో బైండు | ... | 8 | 0 |
| రుక్మిణీకల్యాణము టీక | | ... | 6 | 0 |
| డిటో | క్యాలికో | ... | 8 | 0 |
| కుమారశతకము మూలము అప్పృవుడు 3_3_20 | | | 1 | 6 |
| కుమారశతకము సటీక | ... | ... | 3 | 0 |
| కుచేలోపాఖ్యానము సటీక గట్టుప్రభువు... | | | 6 | 0 |
| వేమనశతకము టీక అప్పృవుడు 19_4_27 ... | | | 8 | 0 |
| భక్తవత్సల శతకము | | ... | 2 | 0 |
| కుమారీ శతకము మూలము | | ... | 1 | 0 |
| డిటో | సటీక | ... | 2 | 0 |
| నృసింహశతకము మూలము | ... | ... | 1 | 6 |
| నృసింహశతకము సటీక | ... | ... | 3 | 0 |
| గానలోల శతకము | | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము టీక | ... | ... | 6 | 0 |
| కుచేలోపాఖ్యానము సటీక | 13_5_19 | | 4 | 0 |
| డిటో | మూలము | ... | 2 | 0 |

వలయువారు:—వేంకటరామ్ అండ్ కో.,
హెడ్డాఫీసు:- ఏలూరు.

3552



| | | | రు. | అ. | ప. |
|---|---|---|---|---|---|
| బాలరామాయణము సటీక | ... | ... | 0 | 2 | 0 |
| ఆంధ్రనామ సంగ్రహము టీక | ... | ... | 0 | 6 | 0 |
| ఆంధ్రనిఘంటుత్రయము సటీక సాదా బైండు | | ... | 0 | 10 | 0 |
| ఆంధ్రనిఘంటుత్రయము ,, అట్ట బైండు | | ... | 0 | 12 | 0 |
| డిటో | క్యాలికో బైండు | ,, | 0 | 14 | 0 |
| ప్రహ్లాదచరిత్ర సప్తమస్కంధము మూలము 11_5_26. | | | 0 | 6 | 0 |
| డిటో | టీకాతాత్పర్యసహితము... | | రు 1 | 8 | 0 |
| అధ్యాత్మ రామాయణకీర్తనలు | ... | ... | 0 | 8 | 0 |
| డిటో | క్యాలికో | ... | 0 | 10 | 0 |
| అమరకోశము ప్రథమకాండము మూలము | | ... | 0 | 2 | 0 |
| డిటో | ప్రథమకాండము అర్థము సహా అప్పృవుడు 11_5_26 | | 0 | 6 | 0 |
| అమరము త్రికాండము సటీక క్యాలికో | | | రు 1 | 12 | 0 |
| డిటో | అట్ట బైండు | ... | రు 1 | 0 | 0 |
| నీతిశాస్త్రము సటీక | 11_5_26 | ... | 0 | 2 | 0 |
| నీతిచంద్రిక అప్పృవుడు | 16_11_26 | ... | 0 | 6 | 0 |
| మొల్లరామాయణము | ... | ... | 0 | 10 | 0 |
| పంచతంత్రము | ... | ... | 0 | 8 | 0 |
| భర్తృహరి సుభాషితము | ... | ... | 0 | 4 | 0 |
| త్రిపురాంతకేశ్వరశతకము భక్తిరస పద్యములు ... | | | 0 | 2 | 0 |
| భద్రగిరి సీతారామశతకము | ... | ... | 0 | 1 | 0 |
| సంధ్యావందనము టీక | ... | ... | 0 | 4 | 0 |
| భక్తవత్సల శతకము | ... | ... | 0 | 2 | 0 |
| బాల శతకము | అప్పృవుడు 1_11_27 | ... | 0 | 1 | 6 |

## వ్యాకరణములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| కర్త, కర్మ, క్రియాబోధిని | ... | ... | 0 | 0 | 6 |
| భాషాభాగ ప్రదీపిక | ... | ... | 0 | 0 | 6 |

వలయువారు—వేంకటరామ్ అండ్ కో.
హెడ్డాఫీసు:—ఏలూరు.

